





# శతకాలు

భక్తి,జ్ఞాన,నీతి

# శతక సముచ్చయము-2





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2040100047246

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణము-సంఖ్య-౩౨.

శ్రీరస్తు.

# శతకసముచ్చయము

## ద్వితీయభాగము.

అనేకపూర్వకవులచే రచియింపఁబడిన శతకములు.



పరిషత్పత్త్రికనుండి పునర్ముద్రితము.

కా కి నా డ.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ.

1933.

వెల ౧౦ అణాలు.

శ్రీరస్తు.

# శతకసముచ్చయము.

## ద్వితీయభాగము.

ఇందుఁ బదిశతకములు గలవు.

### మొదటిది — రామకృష్ణమూర్తిశతకము.

అసంపూర్ణము. కవిపేరు తెలియదు 70 పద్యములు మాత్రము కలవు. దీనిని బ్ర॥ పత్యావోలు రాధామాధవరావుగారిచ్చిరి ఆటవెలఁదులు. "రామకృష్ణమూర్తి రమ్యకీర్తి" అని మకుటము. పుట ౧-౩.

### రెండవది — అగస్త్యేశ్వరశతకము.

సంపూర్ణము, మల్లఁపల్లి మల్లికార్జునపండితారాధ్యులు రచియించినది. మకుటము నాల్గవచరణమున 'పెదనామాభిధాన శివపురావాస్యాద్యగస్త్యేశ్వరా" అని యుండుటచే యతి సర్వత్ర "శ్వా"కు రెండక్షరముల నియమముతో నున్నది. జగ్గయ్యపేట నివాసులు బ్ర॥ శ్రీ ములుగు వీరభద్రశాస్త్రిగారు పంపినది. పెదన గ్రామములోని యీశ్వరుని కంకితము. నడుమ నడుమఁ గొన్నిపదములు లోపించినవి. వృత్తములు. పుట ౪-౨౧.

### మూఁడవది:— మన్నారుకృష్ణశతకము.

పైఁడిపాటి వేంకట నృసింహాకవి రచించినది పోలూరిలోని మన్నారు కృష్ణస్వామి కంకితము. "చారుతరము దక్షిణ పోలూరివాస, వారితామిత తృష్ణ మన్నారుకృష్ణ" అని మకుటము. బళ్ళారిమండలము, హరపనహళ్ళిలోని బ్ర॥ పాలపూఁడి నృసింహ శాస్త్రిగారివలన లభించినది. సీసములు పుట ౨౨-౪౩.

### నాల్గవది:— శ్రీతిరుమలగిరి వేంకటేశ్వరశతకము.

కవి శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తుల సంపత్కుమార శ్రీనివాస వేంకటాచార్యులు. ఏకప్రాస కందములు. కవివృత్తాంతము సంగ్రహముగ శతకము చివరఁ జేర్పఁబడినది. అది జగ్గయ్యపేట నివాసులు శ్రీమాన్ తిరుమలైనల్లాన్ చక్రవర్తి సంపత్కుమార వేంకటరాఘవ చక్రవర్తి అయ్యంగారు శతకముం బంపుచు వ్రాసినది. పుట ౪౪-౫౧.

### ఐదవది:— శ్రీశ్యామలాంబాశతకము.

రెండవశతకము నగు అగస్త్యేశ్వరశతకమును రచియించిన మల్లికార్జున పండితారాధ్యులు రచియించినదియె. సీసపద్యము. పెదనపురీలలామ రామలింగేశ్వరస్వామివామభాగ, చంద్రశాలాసభాలంబ శ్యామలాంబ "అని మకుటము. జగ్గయ్యపేట బ్ర॥ ములుగు వీరభద్రశాస్త్రిగారంపినది. పుట ౫౨-౬౮.

ఆఱవది:—కంచియేకాంబ్రలింగశతకము.

తొంబదినాల్గు పద్యములు మాత్రమే కలవు. పరిషత్పుస్తకభాండాగా [illegible] దత్తకుండలములతో సంపాదింపఁబడినది. కవిపేరు తెలియదు "మదన [illegible] మహితక్షమాశ్రితాంగ, కరధృతకురంగ కంచియేకామ్రలింగ" అని మకుటము గల సీసములు. పుట ౬౯-౭౬.

ఏడవది:—తిరుమల శ్రీవేంకటేశశతకము

[illegible] భగవచ్ఛాస్త్రి కృతము. రేఫప్రాస కందములు. 'తిరుమల [illegible] ప్రియ [illegible] ధీశా" అని మకుటము ఇక్కవి గోవిందశతకమునుగూడ [illegible] జేసియు నియమములు చెప్పి. కవినిగూర్చి ములుగు వీరభద్రశాస్త్రి [illegible] "...భగవచ్ఛాస్త్రులుగారు క్రీ. 1894 ప్రాంతమున జగ్గయ్య [illegible] వేదోక్తముగఁ బౌరహిత్యద్రావిడబ్రాహ్మణులతో నొనర్చిన సంగ్రా [illegible] మహావ్యాసములు, నాఁటికే వారికి షష్టిపూర్తియైనది. [illegible] యునవే 1 యీ తిరుమలగిరి వేంకటేశశతకము 2. గోవిందశతకము, 3. [illegible] విజయము (హరికథ) మున్నగు తెలుఁగు కృతులు రచియించినారు. వీరు సంస్కృతమున స్తోత్రములు, ఉపన్యాసములు పెక్కులు వ్రాసియుండిరి. [illegible] లున్నారు. వారికడనే కొన్ని పత్రములు సేకరించి వ్రాసి యీరెండు [illegible] పరిషత్తునకు సమర్పించుకొను భాగ్యము నేను గాంచితిని." అని. పుట ౭౭-౯౪.

ఎనిమిదవది —మనోహరశతకము.

[illegible] ప్రాసయుతోత్పలమాలలు-పరశురామపంతుల రామమూర్తికవి. "[illegible] లపురీశ రాఘవనృపాల మహీతనయా మనోహరా" అని మకుటము. పరిషత్పుస్తకభాండాగారములోనిది. పుట ౯౫-౧౦౬.

తొమ్మిదవది:—మనశ్శతకము.

పరశురామపంతుల లింగమూర్తికవి ? కందములు. పరిషత్పుస్తకభాండాగారములోనిది. పుట ౧౦౭-౧౧౪.

పదియవది:—శ్రీగిరిమల్లేశశతకము.

"రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ" అని మకుటము. కొమరరాజు రామలింగార్యకవికృతము. సీసపద్యములు. పరిషత్పుస్తకభాండాగారములో నున్నదానికిఁ బ్రతి పుట ౧౧౫-౧౩౨.

# శతకసముచ్చయము

## ద్వితీయభాగము.

---

# ౧. రామకృష్ణమూర్తిశతకము

— ఆటవెలఁదులు —

*  *  *  *  *  *

అగ్గమందునున్న యాత్మతోఁబోరాడఁ, జన్నిబాలు నిందసేయఁజనునె
జ్ఞానియనుచు నీవు జనులదూషింపకు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౧

నామరూపసహితనానాప్రపంచంబు, శ్రోత్రనేత్రములకుఁ జూపుచాలి
జూచుచున్న నీవె చూడంగ బ్రహ్మంబు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨

పాలలోననుండి బైటఁదీసినవెన్న, పాలఁ గలిసిపోదు పాలనున్న
జ్ఞాని కలసిపోఁడు సంసారముననున్న, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౩

ఉప్పుఁగల్లుఁజూడ గొప్పవారాశిలోఁ, గలసిపోయి మరలఁ గానరాక
బ్రహ్మమందు నీప్రపంచ మావిధమయ్యె, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౪

దురదమంటయుఁగల కురుపువంటిదిచుమీ, సుఖముదుఃఖమొందు స్థూలతనువు
కౌషధంబువంటి దాత్మయోగం బది, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౫

జలధినున్నచేఁప జలమునకై యటుఁ, దిరుగఁబోనె యన్యదేశములకుఁ
దన్నునిండుకొన్న తత్త్వంబు వెదకెదు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౬

భూమియందెపుట్టి భూమియందె పెరిఁగి, భూమియందె యణఁగు భూరుహములు
ఆత్మయందు జగములావిధంబుగ నాయె, రామ. ౭

లింగదేహమనెడు పొంగుజ్వరంబున, సంధివలెను మాయ జగతిఁ బుట్టె
దానికౌషధంబు తగురాజయోగంబు, రామ. ౮

ఆత్మఁదెలియనట్టి యాచార్యుఁదెలిసిన, ఫలముదప్పిపోను బ్రహ్మకైన
నూరుపేరులేక యుండంగవలసెరా, రామ. ౯

నిన్ననేఁడుఁబుట్టి నిక్కుచు నీల్గుచు, నున్నవారె యెందునున్నవారు
యుందుఁ జిన్నపెద్ద లెవ్వరు చెప్పుమా, రామ. ౧౦

పందిరూపు గొనుచుఁ బాతాళమునకేగి, శివునిపాదములకుఁ జేరఁడాయె
నట్టివిష్ణుఁ డేమి యధికుండు చెప్పుమా, రామ. ౧౧

దేవుఁ డనుచు బ్రహ్మదేవునిఁ జెప్పకు, దేవుఁడైన వామదేవుచేతి
దెబ్బచేత శిరసు దెగ నిలఁ బడెనేమి, రామ. ౧౨

శివుఁడు దేవుఁ డనుచుఁ జెప్పకు నాతోడ, శివుఁడు దేవుఁడైన సిగ్గులేక
పాఱిపోవనేల భస్మాసురునిభీతి, రామ. ౧౩

బ్రహ్మదేవునితల బ్రద్దలైపోను శం, కరుని యిల్లు వల్లకాడుగాను
వీరు వేల్పులనుచు వెఱ్ఱులపుట్టిరా, రామ. ౧౪

దేహమందున్న దేవునిగానక, దేవులాడనేల దేశమెల్ల
యెండమావులందు నిండేఱు భ్రమలేల, రామ. ౧౫

గురుఁడు బ్రహ్మమఱియు గురుఁడు విష్ణుండును, గురుఁడె త్రిపురదైత్యహరుఁడు సుమ్మి
గురుఁడు కేవలంబు పరమాత్మగానమ్మ, రామ. ౧౬

గురువులనఁగ నెవరో గురుని దేహపంబో, గురుని జూతునంచుఁ గోరువాఁడు
శ్రీగురుప్రసాదసిద్ధికిఁ బాత్రుఁడు, రామ. ౧౭

గురువు గురువనెదరు గురు వెక్కడున్నాఁడు, ఆత్మ దెలుపువాఁడె యాదిగురువు
ఆత్మదెలియఁగానె యాగురువ్వతానాయె, రామ. ౧౮

మాయమాయ యనఁగ మాయెక్కడున్నది, మనసు తనకుఁ బెద్దమాయగాక
మనసుగెలిచినట్టి మనుజుండె దేవుండు, రామ. ౧౯

దేవుఁ డనగ వేఱె దేశాంతరంబున, వెదకఁబోవఁ గలఁడె వెఱ్ఱిగాని
వెదకువాఁడు నెవఁడో వివరించి చూడరా, రామ. ౨౦

విశ్వమునకులోన వెలుపల నెడలేక, యున్నవాఁడు దేవుఁ డన్నవాఁడు
వానిఁ జూడఁబోయి వాఁడె వాఁడాయెరా, రామ. ౨౧

నూకగింజగానలేకను గాడిద, పుట్టెఁ డూఁక కలయ బొక్కినట్లు
సారమెఱుఁగలేని శాస్త్రపారము లేల, రామ. ౨౨

చక్రధారు లనఁగ శైవమతస్థులు, నేమొకాని మఱి సహింపలేరు
చక్రధారిగాని జనుఁ డొక్కఁడును లేఁడు, రామ. ౨౩

లింగధారు లనఁగ వెంగలి వైష్ణవు, లొప్పలేరు నిజము చెప్పలేరు
లింగధారిగాక లేఁడ యెవ్వాఁడును, రామ. ౨౪

మాయగాని యిదియు మంత్రంబులనుబోవ, గ్రహము తేలుపాముగాదు సుమ్ము
బ్రహ్మవిద్యలేని పరువులింకేటికి, రామ. ౨౫

నీచఘనము లనక నిను దిగంబరుఁ జేసి, ఒట్టబైల విసరి పాఱవైచె

గుణవిహీనుఁ డితఁడు గురు నిఁక నుంచకు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౬

గొప్పవాఁడు నొకఁడు కొద్దివాఁ డొకఁడని, తోఁచకున్నవాఁడు దొడ్డవాఁడు
చావుఁ బుట్టుకయును సమము లందఱకును, రామ. ౨౭

తన్నుఁ గన్నయట్టి తల్లిదండ్రుల జన్మ, మెఱుఁగ లేఁడు మీఁద నే మెఱుఁగుఁ
బూర్వకథలు చెప్పి షోకిల్లుపోనేల, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౮

బ్రహ్మ మిది యటంచుఁ బట్టి చూపించిన, జ్ఞానికానివాఁడు కానలేఁడు
అంధుఁడైనవాఁడు నాదిత్యుఁ గాంచునా, రామ. ౨౯

లేనివస్తువందు లేనట్లు దెలిసిన, యపుడె యున్న దున్నయట్లు దెలియు
గల యబద్ధ మనుట కాదె జాగరణంబు, రామకృష్ణమూర్తి. ౩౦

తాను ముక్తినొందఁ దనతోఁ బ్రపంచంబు, ముక్తి నొంద దనుట యుక్తిగాదు
నిదుర చెదరినపుడు చెదరవే కలలన్ని, రామ. ౩౧

దేశకాలము లఁట దేహేంద్రియము లఁట, పుట్టి పెరిఁగి చచ్చిపోవుట లఁట
కడువిచిత్ర మిట్టి కలఁ జూచి నమ్మకు, రామ. ౩౨

ఉన్న బరువు మోయనోపనివారలు, దానికన్న బరువు దాల్ప నేల
ముక్తిగోరి శాస్త్రములు నేర్వగా నేల, రామ. ౩౩

బొంకననుచు వ్రతముఁబూనిన యాదొడ్డ, ధర్మరాజు వ్రతము దప్పిపోయె
నింక నేమి వ్రతము లీనరాధములకు, రామ. ౩౪

విష్ణులోక మనుచు వేఱుగాఁ జెప్పుట, విష్ణువైరబుద్ధి వైష్ణవులకు
విష్ణుమయముగాదె విశ్వంబు సకలంబు, రామ. ౩౫

విష్ణుగీతమైన వేదాంతవాక్యంబు, విననివాని దేమి విష్ణుభక్తి
భర్తమాట వినని పడఁతి పతివ్రతా, రామ. ౩౬

పరమగురుని ప్రేమ భక్తివైరాగ్యముల్, కలుగువారియందుఁ గలిగి యుండు
పాలుగుడుచుచున్న పడఁతులు పతికేల, రామ. ౩౭

మోహబంధనంబు మొదటికే తెగకున్న, దేహబంధనమ్ము తెగదుసుమ్ము
సిగ్గువదలిపోక చీరలు వదలవు, రామ. ౩౮

బ్రహ్మమైనఁగాని ప్రారబ్ధకర్మంబు, తప్పిపోవ దెంత తన్నుకొన్నఁ
దన్నివృత్తికొఱకుఁ దాత్పర్యము లవేల, రామ. ౩౯

దేహ మనెడు దొడ్డదేవాలయమునందు, దేవుఁ డొకఁడు గలఁడు జీవుఁ డనఁగ
జ్ఞానపుష్పమాలఁ బూని పూజింపుము, రామ. ౪౦

దేహమంటె కలఁడు దేవుండనెడువాఁడు, దేహమందె యునికిఁ దెలియఁబోఁడు
అఖిలదేహములకు నాధార మాతఁడు, రామ. ౪౧
చదువు చదువవచ్చుఁ జదువునం దర్థంబు, తప్పకుండ విప్పి చెప్పవచ్చు
భావ మెఱుఁగువాఁడు బ్రహ్మవిద్వాంసుండు, రామ. ౪౨
క్షేత్రతీర్థములకు సేవింపఁబోవచ్చు, శిలలఁ జూచి పూజ సేయవచ్చు
నిన్ను నీవె తెలిసి నిజమైన గతినొందు, రామ. ౪౩
తల్లిదండ్రిపుత్త్రదారాదికంబును, గల దటంచుఁ జాలగర్వపడకు
కోమటైనఁ గలదు దొడ్డభాగ్యమెగాదు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౪౪
పుస్తకంబు కాలిపోయిన దానిలో, గ్రంథమింత యైనఁ గాలిపోదు
తనువులెన్ని చనినఁ దాఁ జావఁ డెపుడును, రామకృష్ణ. ౪౫
వేదవిదులు కోరి విధించిన స్వర్గాది, ఫలమునందు నీకు భ్రాంతియేల
మక్కువేల పుట్టెఁ ముక్కిన కూటికి, రామకృష్ణ. ౪౬
స్వర్గనరకహేతుసకలకర్మాటవిఁ, బరమయోగవహ్నిపాలుచేసి
విశ్వమంత గెలిచి వెలుఁగు బ్రహ్మంబవై, రామకృష్ణ. ౪౭
ఫలము గల దటంచు భ్రాంతిచేఁ గర్మంబు, లాచరించుటెల్ల నీచవృత్తి
ఆజ్యధారచుమ్మి యజ్ఞానవహ్నికి, రామకృష్ణ. ౪౮
జననమరణరూపసంసారదుఃఖంబు, తెలివిపుట్టినపుడె తీఱిపోదె
స్వప్నమందుఁ గన్న సంకటంబులువోలె, రామ. ౪౯
వత్సరములు విద్య వర్ణాశ్రమాదులు, గలుగువాఁడు పెద్దగాఁడు చుమ్మి
యున్నవస్తు నెఱిఁగి యున్నవాఁడే పెద్ద, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౫౦
ఆత్మ నెవ్వఁ డెఱుఁగు నతఁడె బ్రహ్మణ్యుండు, ఆత్మ నెవ్వఁ డెఱుఁగఁ డతఁడు మాల
యిన్ని వర్ణములకు నేర్పాటు చూడుమా, రామ. ౫౧
ఆత్మ నెఱుఁగకున్న నాబ్రహ్మతో నైనఁ, జెలిమిసేయఁబోవ సిగ్గుగాదె
సత్య మెఱిఁగియున్న చండాలు సేవింపు, రామకృ. ౫౨
నామరూపములను నానావిధంబుల, నున్నఁగాని జీవుఁ డొక్కరూపు
పశువు వేఱుగాని పాలొక్కరూపంబు, రామ. ౫౩
ఒక్కయవయవంబె యొప్పునే దేహమై, యన్నియవయవంబు లగుటఁగాని
ప్రాణు లన్ని గూడఁ బరమాణురూపంబు, రామ. ౫౪
తెలివిలేనివాని బలిమిని దెప్పించి, దివ్యమోక్షపదవి దెలుపుటెల్ల

సరిగఁ జెవిటియొద్ద శంఖ మూఁదినయట్లు, రామకృష్ణమూర్తిరమ్యకీర్తి. ౫౫

గతి యెఱుంగలేక కైలాసవైకుంఠ, లోకములకుఁ బోవ లోలుఁ డగుచు
మతములందుఁ బుట్టి మతిచెడితిరుగును, రామ ౫౬

బ్రహ్మవిష్ణుశివులు పతు లఁట లోకంబు, పుట్టి పెరిఁగి చచ్చిపోవుటకును
గార్యమందు నెవఁడుఁ గానంగరాఁడేమి, రామ. ౫౭

నదిని దిరుగుచున్న నావపైవానికి, నొడ్డుమీఁద నున్నయూరు దిరుగు
అట్లు మనసు భ్రాంతి నఖిలవిభ్రాంతులు, రామ. ౫౮

భూమినున్న జలము భూమిగుణంబులఁ, బొందినట్లు మనసుపొందుచేత
మనసుధర్మమెల్ల మానదు తనకును, రామ. ౫౯

కట్టబట్టవలెనె కట్టుచు విప్పుచు, నట్టితనువులందుఁ గట్టువడక
యెప్పటట్ల నీవు నొప్పుగా వెలుఁగుమా, రామ. ౬౦

పరఁగు సూక్ష్మతనువు ప్రాణమనోబుద్ధి, దశవిధేంద్రియాన్వితంబు గాఁగ
నందుఁ గలయ జీవుఁ డందురు నిన్నును, రామ. ౬౧

స్థూలసూక్ష్మదేహమూల మజ్ఞానంబు, కారణాంగ మనఁగఁ గల దదొకటి
దానిఁ ద్రుంపవలయు జ్ఞానసాధకముగ, రామకృ. ౬౨

నిన్ను మఱచి మున్ను నీవైనయట్ల యా, నిన్ను మఱచి మఱియు నీవు గమ్ము
నీవు నీవు గాఁగ నిఖిలంబు నీవౌదు, రామ. ౬౩

జ్ఞాని యనఁగఁ బ్రభువు జ్ఞాన మాతనిసొమ్ము, సొమ్ముపెట్టె లాగమమ్ము లెల్ల
మొరయఁ జదువువారు మోఁతకూలీ లయా, రామ. ౬౪

రాజుభార్యతోడ రమియించుచున్నను, నదియు బైటఁ బెట్టఁ బోనిగాదె
బ్రహ్మవేత్త ననుచుఁ బరులకుఁ జెప్పకు, రామ. ౬౫

ఇనుపపుల్లఁబట్టి యెండుతాఁటాకుపై, వ్రాసి నోసి నోటఁ గూసినట్టి
చదువు నమ్మఁబోకు సద్గతి దొరకదు, రామ. ౬౬

అన్యశూన్యపదము నందుచు దంపతుల్, సిగ్గుతోడ విడిచి చీరలెల్ల
రతిసుఖంబుగొన్నగతినుండు శివయోగి, రామ. ౬౭

పెండ్లియాడనిమ్ము పెండ్లాముఁదానును, నొక్కటౌచు వేఱె యుండనిమ్ము
కన్నదానిపొట్టకడుపువత్తుటకోరి, రామ. ౬౮

చిన్ననాఁటనుండి చేసినకర్మంబు, గురునికప్పగించు కోర్కిలేక
గురుని కరుణలేక దొరకదు మోక్షము, రామ. ౬౯

కలుగువాఁడు నొకఁడు కలుగనివాఁ డొక, డింతెకాని వేఱె యేమిలేదు
    యిట్టితెలివికంటె నెట్టిదో మోక్షంబు, రామ. ౨౦
ఏమిచేతఁగాని యీనరు లొకవేళ, వైరు లనుచు వదలవద్దుసుమ్ము
    శౌర్యమున్నఁ జంపు శత్రుషడ్వర్గము, రామ. ౨౧
సూర్యుఁ డున్నఁగాని చూడరు జగములు, కన్ను లున్నఁగాని కాన రతని
    కన్ను లుండు టెట్లు ఘనబుద్ధి లయ మయ్యో, రామ. ౨౨
పాంచభౌతికాఖ్యభవనంబులోపల, నిన్ను మఱచి నీవు నిదురవోవ
    నిన్ను లేపువాఁడు సన్నుతాచార్యుండు, రామ. ౨౩
నిదురపోతి నంచు నెదుటివానికిఁ జెప్ప, నిదురపోవనట్టు నిజముగాదె
    బ్రహ్మమైనవాఁడు పరులకుఁ జెప్పునా, రామ. ౨౪
నీవు గలుగుకొఱకు నేనును గలుగుట, నేను గలుగుకొఱకుఁ దాను గలిగె
    తానుతానుగాఁగఁ దనకెవ్వరునులేరు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౫
మోహజలధి నీఁది ముక్తుఁడై శివయోగి, దేహమందునుండి తెలియరాఁడు
    పరఁగుకాయలోనికురిడిప్రకారంబు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౬

అసంపూర్ణము.

(ఈశతకము శ్రీయుత సత్యవోలు రాధామాధవరావుగా రిచ్చినది.)

శ్రీరస్తు.

# ౨. అగస్త్యేశ్వరశతకము.

---

శా. శ్రీమత్పర్వతపుత్రికాహృదయ రాజీవాళి దుష్టోత్కట
స్తోమధ్వాంతనితాంత హేళి బుధసందోహాదిరాణ్మౌళి ని
త్యామర్త్యాలయవాహినీభువనభంగాభోగచూళీకళా
స్వామీ సత్పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౧

శా. ఆకాశంబు నిరావకాశ మదియేకా కేశపాశంబుగాఁ
గా కైవల్యపదంబునొందిన చిదాకాశ ప్రకాశత్వదా
నీకాశ ప్రతిభాస్వరూప మిల వర్ణింపంగ శక్యంబె స
త్ప్రాకారా పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౨

మ. తలలుం గన్నులు నాల్కలుం గలిసి మొత్తం బైదువే లున్నతిం
గల శేషాహి భవన్మహామహిమ సాకల్యంబుగా నెన్న గా
సిలి కాలంబడి వ్రేలుచుండఁగ నొరు ల్చింతింపఁగా నెంతవా
రలు ని న్నో పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. 3

మ. భవదుద్యత్కరుణాకటాక్షభవసంపద్వీక్షణాలబ్ధమ
త్కవితాలంకృతవృత్తపద్యశతసంతానప్రసూనాచ్ఛదా
మవితానం బిదిగైకొనం దగు మహామంత్రార్థసాంగత్యరూ
పవిలాసా పెడనాభిధానశివపూర్వ. ౪

శా. గంధేభాంధకదైత్యదర్పహర దుర్గానాధ దుర్వారగ
ర్వాంధు ల్గానఁగ లేరు నీమహిమ జాత్యంధు లసదా పద్మినీ
బంధుం జూడనిమాడ్కిఁ జిత్త మిది నా భాగ్యంబు విద్యావియ
త్పంథానా పెడనాభిధానశివపూర్వ. ౫

శా. శాంతస్వాంతసు                    తపటదాశాంతస్వభూసర్వభూ
తాంతర్యామివి నీవయై నిఖిలలోకాళిం గడుం బెంప నేఁ
జింతింప న్మదిఁ గల్మి లేములకు నాసింతు న్భవద్భక్తిమ
త్ప్రాంతంబా పెడనాభిధానశివపూర్వ. ౬

మ. క్షితి నిండూపలరాశి కౌముది శరాకీర్ణంబు గావించుసం
గతి భక్తిం గరఁగించి లో నినుఁ గొనం గానవ్వ లెంగాక కు
త్సితకృత్యంబున మన్మథుండు సుమరాజిఁ గెల్చెనే నిన్ను సు
వ్రతిలీలం బెడనాభిధానశివపూర్వ. ౭

మ. స్మరజద్భక్తిరసాంబుపూరితము (శ్రీ)మన్మానసావాలమం
దురహీ న్నీపదపల్లవాంకురము సంతోషంబుతో నిల్పి సు
స్థిరముం జేసిన దాన ముక్తిఫల మర్థిం గాంతు రానేర్పు చూ
పరు లెంచ న్బెడనాభిధానశివపూర్వస్వాద్యగస్త్యేశ్వరా. ౧౬

మ. నరులుం గిన్నరులు న్మునీశ్వరులు నానానిర్జరు ల్గాడినం
దిరుగంబాఱునె లోకసంతతియు, సాధింపంగ నౌనే నిర
క్షరకుక్షింభరు లెందఱైన నొకశాస్త్రజ్ఞుండు వాదించు దు
ర్భరయుక్తిం బెడనాభిధాన. ౧౭

మ. సమయాచార్యుఁడ వీవు శిష్యుఁడ నజస్రం బేను సత్యం బవ
శ్యము నన్గావఁగ దాత వీవరయ యుష్మద్భక్తిభాగ్యంబు ని
త్యముగాఁగ భువి మించుఁ దద్యశముచేత న్మించునీమూర్తి త
త్త్వమయంబై పెడనాభిధాన. ౧౮

మ. సరసం బీఘటమందిరంబునను సుజ్ఞానాఖ్యదీపాంకురం
బురులీల న్వెలిఁగింపఁజేయుట సురవ్యూహప్రధానుండ వై
దొరవై చీఁకటియింట నుంట తగ దెందుం జూడ నీవేపరా
పరమేశా పెడనాభిధాన. ౧౯

మ. నెపమే నీవు జగద్గురుండ వనుచో నేఁజేయుపాపంబు లే
దెపుడైనం గలదేని జెందు నట ని న్నే శిష్యపాపం గురో
రపియ న్వాగ్గతి నే నిరాఘుఁడ నిర............ధ
ర్మపరుల్ (శ్రీ)పెడనాభిదాన. ౨౦

శా. అంబాబింబఫలాధరేశ్వర శిరస్సాష్టాంగదండప్రణా
మం బే నిప్డొనర్తు నంత కభిరామం బెన్న లేదెందు ని
త్యం బేఁ జేసినతప్పు లన్నిటికి డాయన్రావె సుజ్ఞానదీ
పంబీవే పెడనాభిధాన. ౨౧

మ. మును దారాపతి దక్షశాపహతి నింపుం బెంపుఁ బోనాడి కూ
లిన వానిం దగ నెత్తి నెత్తి నిడి పాలింపంగ నిత్యాశ్రితుం
డను నిర్దోషిని నీదుకాళ్లకడ నైనం జేర్చి రక్షించు టొ
ప్పునిదేనా పెడనాభిధాన. ౨౨

మ. గృహాశల్యంబులు గూల్చి కట్టిన మరుద్గేహంబున న్నీదు వి

గ్గన్నా చిచ్చగు నెమ్మునొమ్ము నినుఁ గన్నం జాలు నీకల్మిమే
ల్వన్నేరా పెడనాభిధాన. ౩౦

శా. అన్నా మున్వలపించె నేర్పొనర ని న్నాపార్వతీదేవి నీ
కన్నం జక్కనివాఁడు లేఁడనుచు ని న్గాఢించి మోహించి ము
న్నెన్నో నోములు నోఁచి దాన నగ మయ్యె న్నీదుమే న్గారసం
పన్నం బై పెడనాభిధాన. ౩౧

మ. అనుమానం బొక యింత లేదు నగమీ వై పోతి వీవున్న రూ
పొనరం జెప్పినఁ బౌరుషంబు నగమై యొప్పారె నీజాడఁ జూ
డ నిజంబాడిన నిష్ఠురంబు వెనువెంట న్వచ్చు నాకేల నీ
పనియింతే పెడనాభిధాన. ౩౨

శా. తల్లిం గానక తండ్రిపే రెఱుఁగ కా తన్వీలలామంబె మే
లిల్లు న్వాకిలి తోడునీడ యని నీకీక్షింపఁ దచ్ఛక్తి నీ
వెల్ల న్నీ వని లోఁ గనుంగొనియె నింకేమైన నుదున్నదే
పల్లెత్తం బెడనాభిధాన. ౩౩

మ. రసన న్నేల నయోక్తు లెంత ప్రియమారం జెప్పినం బల్కకు
న్నసదా స్థాణుఁడ వంటి ని ట్లనుటకై నా గానరావైతి విం
తసిధారావ్రత మైన మంచిదనరాదా యిప్పుడే యింత యీ
రసమేలా పెడనాభిధాన. ౩౪

మ. జలగంధాక్షతపత్రపుష్పచయరాజద్ధూపదీపాదులం
గలకాలంబు నినుం భజించి నుతుల న్గావించి మెప్పించి లో
కులు నీయిల్లు గడంగి చూఱగొన నీకు న్మస్తిష్క ట్లోల్లిగా
వలసెంగా పెడనాభిధాన. ౩౫

శా. నీ వెందున్న సమస్తసంపదలు ముందే వేఁడి కొన్నంతలోఁ
గా వే యిచ్చి గణాధినాథులకొడల్ వైగనేసి తద్భూతిచే
నావేశించి తిరింగ నెల్లెడల నీ యౌచిత్యమే యింతగా
రావించెం బెడనాభిధాన. ౩౬

శా. అయ్యయ్యో విష మేల తింటి వది నీ కాహార మెట్లయ్యె నా
నయ్యా కుత్తుక బంటి యున్న యది యట్లైన న్భయంబేమి నా
కుయ్యాలింపు సనాతనుండవీఁక నీకుం జేటు రావెప్డు నా

పర్యాయసం బెడనాభిధాన శివపూర్వస్త్ర్యద్యగస్త్యేశ్వరా. ౩౮

మ. క్షమియింపందగు నెన్నఁబూనిన నశక్యం బస్మదీయాపరా
ధము లెన్నైన విడంగ నౌను నిజసంతానం బవెంతెంత త
ప్పు మదింగూర్చినఁ గన్నతండ్రి మది నీ మోదంబు లోకాహిత
ప్రమదంబా పెడనాభిధా. ౩౯

మ. ధనదప్రాణపదంబు నీరజనసంతానంబు నీపాదద
ర్శనమైతే నదిగల్గుటే యరిది గాంచం గల్గిన న్గోపమే
లనగుం బెన్నిధిఁగన్నరీఁద కికనేలా చింతిలం గ్రోడికీ
రనుతింతుం బెడనాభిధాన. ౩౯

మ. నుతియింపం గడ గానలేరెవరు విర్చుక్ ధాత ని స్సీమ వి
శ్రుతరూపంబు గణింపలేక చతురాస్యుం డయ్యె శేషుం డభో
గతిపాలయ్యె శ్రుతుల్ చికాకుపడియె న్నా నీమహాత్త్వంబు శా
శ్వత మయ్యెం బెడనాభిధాన. ౪౦

మ. జగతిం బుట్టినదాదిగాఁ గుటిలసంసారాంబుధిం ద్రోచి నె
వ్వగలన్ దొంగతనంబునం దిరుగు కోర్వాజాలఁ దచ్ఛౌర్య మో
నిగమాంతస్తుత చూడు పట్టుపడితే విన్ భక్తిబంధించి నా
వగ నేస్తుం బెడనాభిధాన. ౪౧

శా. ఆబాణాసురుఁ డేమిచుందిడెనో వికాయింటివాకింటఁ గా
పై బంట్పెటనుంటి నాయుపమ నాయందున్న నాలోననా
బంధంబున నుండు మీవు వారవై సత్యంబు సందేహమే
ప్రేఁబల్కు ల్పెడనాభిధాన. ౪౨

మ. కరుణాంతఃకరణాబు నీదనుచు నేఁ గాంక్షింప నింద్యాకళే
సరిగాఁ జూచెద వింతె చాలు నది ముం జత్రాతిరాముద్దుఁగూఁ
తుకిసయ్యాటల గట్టిదేకీనది యామం గట్టిగాదే దయా
వరణంబై పెడనాభిధాన. ౪౩

మ. ప్రమథాధ్యక్ష మహోక్షసైంధవ జగద్బంధో దయాసింధవేం
దుమణిస్ఫాటికసన్నిభాంగరుచయే తుభ్యం నమో దేవదే
వ మహాదేవ దృఢప్రభావ చిదచిద్వ్యాపార మాంపాహి స
ర్వమనోద్యత్పెడనాభిధాన. ౪౪

మ. అనభిజ్ఞోన్మదభాగ్యగర్వచలనోద్యద్విస్మృతు ల్బాల్యయౌ
వనకౌమారజరాంతకాలముల సంప్రాప్తంబు లిందొక్కవే
ళ నినుం బ్రస్తుతిసేయఁగందు నని యేలా యింది నందున్న నీ
పని విందు న్పెడనాభిధాన. ౪౫

శా. నానాశాస్త్రపురాణవేదపరనానందం బదెంతైన వి
జ్ఞానం బన్నది లేక వేఁడిన విశేషంబేమి బోధింప వి
జ్ఞానం బద్దములోనఁ జీకు గనునాచందంబు నన్నించు నీ
వానింగాఁ బెడనాభిధాన. ౪౬

శా. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను నీసంసారమూహింప న
త్యుగ్రం బ్బొక్కటు దుఃఖభాజనముచం దుత్సాహముంబొందు భా
వగ్రంధి న్సడలించి ప్రోవు మని నిర్వ్యాజ్యక్షించితిన్గాదె మ
... ... ... ... ... ౪౭

మ. సిరి దాఁజేరినఁ జేరుఁగాక జనరాశిన్ ధర్మకీర్తిద్వయం
స్థిర మన్పద్ధతి రెండుదప్ప మఱి యేదీ మర్త్యలోకంబునం
దరయన్ శాశ్వత మన్న దింకొకఁడు నీయందమ్యె సర్వం బవాం
తరలీల న్పెడనాభిధాన. ౪౮

శా. శ్రీమంతుండవు భక్తబాంధవుఁడ వుత్కృష్టార్థసీమా మహా
ద్దామా బిడ్డలఁ గన్నతండ్రి వెద నిర్దాక్షిణ్య మింతేల యో
స్వామీ నీశరణాగతుండ నిఁకనాపైఁగూర్మిరానీ శివా
వామాంగా పెడనాభిధాన. ౪౯

శా. ప్రాలేయాచలకన్యకాప్రియ భవత్పాదారవిందార్చనా
లోలుండై హరి నేత్రపద్మమునఁ దక్కుల్చిల్కఁగాఁ బూన్చి త
త్కాలౌచిత్యము దీర్చికాంచెఁ గద నీకారుణ్యముం దా జగ
త్పాలుండై పెడనాభిధాన శివపూర్వస్త్ర్యాద్యగస్త్యేశ్వరా. ౫౦

శా. ఆర్యాలోల మదీయవర్తనము సవ్యంబైనఁ గాకున్న నా
దార్యప్రక్రియ కేమి లోపమగు నర్థప్రాణము ల్రెండు నా
చార్యాధీనములే కదా తుదకు నీసందేహముం దీర్ప దు
ర్వార్యంబా పెడనాభిధాన. ౫౧

శా. ఏ నిన్నమ్మితి నమ్మినందుకు మదీయేష్టార్థసంసిద్ధి నీ

చే నేనాఁటికి నా నిదేమి పనిగాఁ జిత్తంబునం దోఁచె ని
ష్ఠైనం బ్రాణము లైదు నీకొసఁగి నీయం దైక్యమేఁ గాంతునో
రా నీతి న్బెడనాభిధాన. ౫౨

శా. పూర్వజ్ఞానము లేనివాఁడ నను సంబోధించి వేవేగ మ
ద్గర్వంబంతయుఁ గూల్చి భక్తినిరతుం గావించి రక్షింపవే
సర్వాభీష్టఫలప్రదాత వయి నాస్వామీ కృపాదృష్టిమైఁ
బర్వన్ శ్రీపెడనాభిధాన. ౫౩

శా. నీనామస్మరణంబె పావనముగా నిష్టం బ్రవర్తించు వి
జ్ఞానాత్ముండు కృతార్థుఁ డౌటరుదె దుశ్చారిత్రుఁ డైనం గళా
హీనుం డైనను ముక్తుఁ డౌఁ బరశివా యేత్యక్షకాంతసుధా
పానాప్తిం బెడనాభిధాన. ౫౪

శా. నీవొక్కండవు దప్ప నన్నెఱిఁగి మన్నింపంగ వేఱొక్కరుం
డేవంకం గలఁ డయ్యె నాయెడల లేఁ డేవంక నీవింక న
న్నావంగాఁ దగుఁ బంకజాక్షునకు బాంధవ్యంబు నిత్యంబె సం
భావింపం బెడనాభిధాన. ౫౫

శా. నీసౌందర్యముఁ జూచి మోహినియునై నీరేజపత్రేక్షణుం
డేసైరింపక మున్ను మానివనవాటిం గూడె నిన్నన్నవే
రాస ల్బాసటమై నటింప మునిభార్య ల్గూడి సేవించు టే
త్రాసంబా పెడనాభిధాన. ౫౬

శా. కైలాసం బనిశంబుఁ జేరుఁ సుమహాత్మాండంబు నాపారిష
జ్జాలంబుం గెడతోడునీడలయి నీజాడం బ్రవర్తింతు రా
లాలిత్యంబు విచిత్ర మందు నిను నేలాగందు నీక్గొనన్
బేలా నా పెడనాభిధాన. ౫౭

శా. కాదే రోగికి మృత్యుసన్నిహితమై కన్పట్టునావేళ నా
నాదివ్యౌషధమంత్ర తంత్రముల సౌనాపత్ర్యహారంబు నా
నాదిప్రాప్తశివాక్షరద్వయి నదే నల్లప్పు డీఁగాంతు నీ
పాదంబు న్బెడనాభిధాన. ౫౮

మ. తనకుం గల్మి గలంతకాల మెపుడున్ దానంబు ధర్మం బటం
చును బుద్ధింతయు లేక తాఁ గొనిన దుర్దారిద్ర్యముం జింత సే

సిననేమూ నది శైల మేదినతుదిం జంతింప దీప్రక్రకో
పనమూనా పెడనాభిధాన. ౫౯
మ. ముదు గావించిన పుణ్యలేశమున నేమో కూడుకు కాని స
ద్వినియోగంబున కందరాని ధన మన్వేషింపనాఁ గాక చో
రనరేంద్రాజ్ఞలచేతఁ దక్కు నెడ నర్థప్రాప్తికి న్వ్యక్తిక
ల్పన గాదే పెడనాభిధాన. ౬౦
మ......హితకంరభూషణము రం గుల్మేటి తద్వల...
గణనం బైనవధూశిరోధి నెడలంగా ధర్మరాహిత్యమై
గుణముంటం దలకొన్న భాగ్యము దొలంగుంగాక సంధిల్లునా
ఫణిభూషా పెడనాభిధాన. ౬౧
శా. ధర్మం బర్జనభూమిభృత్తిలక మే తద్ధర్మకర్మం బన
త్త్వర్మవ్యూహనికృంతనం బగుట సాధ్యంబన్న నీ కింతకుఁ
ధర్మంబన్నది యున్నఁ గాచికొను దధ్యం బాద్యదేహప్రభా
వర్మంబే పెడనాభిధాన. ౬౨
మ. అలసన్న్యాసికి లేదు తస్కరభయం బాభీతి సొమ్మున్నవా
రలకే వారిది లేమిగా దది దరిద్రప్రాణులంబైన ని
శ్చలమా భక్తిధనంబుకల్మి ధనికు ల్సత్యం బదే నాపద
ల్వలగొన్నం బెడనాభిధాన. ౬౩
మ. అతిలోభిం గనుఁగొన్న యాచకజనం బాకాంక్షమై నర్థసం
తతి యార్జించునె దాతలం గనిన పేదల్బంగి నీదర్శనో
న్నతి నింపొందు సమస్తభాగ్యశుభకందం బిందు కెందేది సం
ప్రతిచూడ న్పెడనాభిధాన. ౬౪
శా. శిష్టాచారము లేల గ ల్గకుచి కీక్షింపంగ యావజ్జనో
చ్ఛిష్టగ్రాహికిఁ గల్గు నెట్లు రుచి భక్షింపంగ నీ రెండుఁ జెం
దష్టైశ్వరసమిద్ధభోగి కిల నీ యాశీర్వచఃప్రాభవా
వ్యష్టిఁ శ్రీపెడదాభిధాన. ౬౫
శా. ఇంటింటం జని వంటకంబు గొనలే కిట్టట్టుగాఁ బెంటలో
కంటం బంటను బట్టి గీరికొని సాయంబైన కాకంబులా
యంటంటం జెయివీచుచు న్మెసఁగు నిత్యాశాశుచిగ్రాహి ని

...బానా పెడనాభిధాన శివపూర్వస్వామ్యద్యగస్త్యేశ్వరా. ౬౬

మ. కలకాలంబు గురూపదేశ విదితజ్ఞానంబులే కాత్మచం
చలమై విస్మృతిఁ జెందునప్పు డెదలో శంకించుమూఢుండు దాఁ
గలుపజ్జాన్నెలకుక్కరౌవ్వ మనుసంజ్ఞం దెల్పె ముందున్నదే
ఫలమింతే పెడనాభిధాన. ౬౭

శా. నీసద్భక్తి విహీనులై తిరుగు దుర్నీతు ల్మది న్మోక్షల
క్ష్మీసాంగత్యము గాంతురే నిజము గాపెందప్పి చింతిల్లకన్
భాసిల్లం గలదే యనాథలకు సౌభాగ్యంబు తన్మంగళ
ప్రాసంబై పెడనాభిధాన. ౬౮

శా. బాలక్రీడల కెల్లమూల మగు సంభావించి యాడించు నీ
లీలామానుషవిగ్రహంబు విధికేని న్నిల్పఁ జాలించినం
గీలూడం బడు జంత్రపుం బ్రతిమవాక్షిం గ్రాలు నీవేతగుం
బాలింపం బెడనాభిధాన. ౬౯

శా. తోఁడేళ్లన్న మృగంబులట్లు మది... ... ... ...
లాడింపంగ నెఱుంగలేక యము డాయంబోవు మర్త్యాళికిం
జూడం జుట్టము ముక్తికైనను మదిన్ శోధింప నీకంటె నె
వ్వాఁడీవే పెడనాభిధాన. ౭౦

మ. సకలాఘోర్మితరంగసంగతము సంసారార్ణవం బంతఁ బోఁ
దికగా మత్తిలి యున్న చిత్తి మనురక్తిం జేసి వైరాగ్యమా
ర్గకళావ్యక్తి నెఱుంగ నీఁగకును సౌగంధ్యంబు సొంపార న ద
ర్పకభంగా పెడనాభిధాన. ౭౧

శా. ఎందుం దోఁడయి నిల్చియుండఁ డది నీవెందున్న నీయందె నా
డెందం బిందుకు సందియంబువల దుండె న్భవ్యత్వత్పాదమిం
పొంద న్మట్టుచు బాసచేసెద నిదే యూహింప నీకాళ్ళకున్
బందం బౌ పెడనాభిధాన. ౭౨

మ. ధరఁ బుట్టింపఁ గరంబుఁ బెంప ననుసంధానంబు గావింప నే
ర్పరివై సర్వ మనుగ్రహింప ననుఁ బ్రోవన్నీ కసాధ్యంబె యిం
దరవిందప్రభ చిత్రభానున కనాహ్లాదంబె నాతండ్రి నీ
వరవుండం బెడనాభిధాన. ౭౩

మ. కుడిక న్నంబుజబాంధవుం డెడమక న్నోకాహితుం డగ్గినె
న్నడుమ న్మిక్కిలికన్ను నం దొకట రెంట న్మాట ముచ్చెయ్యాలిం
పడర న్నిగ్రహమం దనుగ్రహమునం దైక్యంబు సంధింతు చే
ద్పడు వేళం బెడనాభిధానశివపూర్వస్వ్యాద్యగస్త్యేశ్వరా. ౨౪

మ. కడువేగ౯ గుడిస్రింగువాని కట లింగం బ్లోక్ష లక్ష్మౌన ని
న్వడి లోఁగొన్నమహానుభావునకుఁ గైవల్యంబు ముందెవ్వ డం
చడుగంగాఁ బనియేమి తక్షణము వశ్యం బౌటయే గాక చొ
ప్పడకున్నే పెడనాభిధానశివపూర్వ- ౨౫

మ. చనుచో నల్లక పట్టితెచ్చి మధురాజ్యక్షీరము లోవ్వసి పెం
చినసర్పంబు విషంబు మానని క్రియ౯ శీలంబు లెన్నెన్ని చె
ప్పిన మూఢుండు (నిజంబు) గన్గొనఁడు తద్వృత్తంబు లానైజక
ర్మనిరూఢిం బెడనాభిధానశివ- ౨౬

శా. ధీరోదారగభీరవాఙ్మధుర ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...గానోపుకా
వేరీవారి మునింగియున్నశిల పృథ్విన్మెత్తనౌనే కృపా
పారీణా పెడనాభిధానశివ- ౨౭

శా. అర్వాచీనవటద్రుమూలఫలవిద్యామూర్తి భాస్వన్నిజా
శీర్వాదస్థిరవర్ధమానమునిరాజీజ్ఞానదీపాంకురా
ఖర్వస్ఫూర్తి సమస్తలోకహితభక్తవ్రాతహృద్వర్తిదృ
క్పర్వా (శ్రీ) పెడనాభిధానశివ- ౨౮

మ. తనుపెన్నంటఁ గడంగివచ్చు యముపంతం బంత దూలించి ని
న్ననుఁగుంగౌఁగిలి లోఁగొనం గనిన నిత్యానందుని జ్ఞానినం
దనునిం గాచి పదాహతిం గెడపి తే దండాయుధు న్నాథుమా
ర్గనిరోధుం బెడనాభిధాన- ౨౯

మ. కడలిం బుట్టి దివంబు ముట్టి కడిమి న్గప్పట్టి జేజేల ని
ల్చడలెల్ల న్విడఁగొట్టి మిట్టిపడు నా కాకోలముం బట్టి నే
రెడుఁబండుం బలెనొత్తి పట్టి విగతార్తిం గ్రోలి తింత్రైన వె
ల్వడసీకం బెడనాభిధానశివ- ౩౦

మ. మదమాతంగబలాంతకారి చటులోన్మాదంబున న్మున్న ద

న్నెదురుం గానక నీదుకయ్యమునకై యేతేరం బోకార్చి నే
ర్పొదవం దాల్చి తదాజినంబు కృతకృత్యుం జేసితే వానిం జే
వదలిర్పం బెడనాభిధానశి ౨- ౮౧

శా. జౌరా తారకుం డల్గి సర్వ మెడసేయం గల్గి హేజివ్వ కిం
పార న్నిన్ను మగంటిమి న్నగడీ నిప్పై వెల్గి చల్లాఱెం దా
నాఱంబోయిన దీపమోన భవదీయంబైన కౌమారకం
పాకోచిం బెడనాభిధాన- ౮౨

మ. సురసంఘాత విఘాతనవ్రతపటిష్ఠుండైన యయ్యాంధకా
సురు విధ్వంస మొనర్చి (యంత) దిగసేను ల్సార్వసామ్రాజ్యసం
భరణు ల్గా నభయప్రదాత వగుచు న్భాసిల్లితో లోక భా
స్వరలీలం బెడనాభిధాన- ౮౩

మ. రథరథ్యద్విరథాంగసారథిధనుర్బాణేషుధిజ్యాళియౌ
పృథివీ వేదరవీందువాక్పతిసురాద్రి శ్రీ వధూనాథవా
ర్నిధిభోగీంద్రులుగాం బురత్రితయము న్నిర్జించు నీచర్యలు
గ్రథురంబుల్ పెడనాభిధానశివ- ౮౪

శా. గాంగేయాచలచాప నీకొడలు సైగంగన్నం గన్పట్టు నీ
లింగాంగం గనుచో మొఱంగెదవు హాళిం గొంద అజ్ఞాను లే
నుంగుం గన్గొను కుక్షులుం బలెను మన్ను న్మిన్ను నీవెన్నంగా
వంగానేం బెడనాభిధాన- ౮౫

మ. శివనిందాపరు లైనవారికిది పాసిల్లంగ దృష్టంబటం
చవలీల న్మఖదీక్షితుం డఘపురాధ్యక్షుండు దక్షుండు ము
న్నవలాలాయుత మైన గోత్రతలతో డం గుందంగా నున్న మా
న్నవశంబే పెడనాభిధాన- ౮౬

మ. సుమనస్సుం డొకవేళ నాఱ్వితమనస్తోకంబుగా ముట్టిన
న్విమలజ్ఞానము గోలుపోయి నినుగా వేఱెందు చేపట్టునే
నుమనస్సింధువు నైజ మొందదె విపార్చుల్ గ్రమ్మఱం బుట్టి తం
త్రమఖేశా పెడనాభిధానశివపూ- ౮౭

మ మలదేహు ల్పదివేలు గూడినను సామ్యం బాదు శే నిత్యని
ర్మలచిత్తుం డగు న్నేకభక్తునికి సామాన్యంబు పో దున్న ము

న్నలరాయంచ కనంగుపుల్గులు సమం బౌనయ్య వేఱొండనా
వలదింకం బెడనాభిధానశివపూర్వస్వ్యాద్యగస్త్యేశ్వరా. ౮౮

శా. నీలగ్రీవ మహానుభావ త్రిజగన్నిస్తారణపారీణ కా
కోలాహార భుజంగహార నగరాట్కోదండ సంపోషితా
ఖిలాంభోజభవాండభాండ సదరీభృద్వల్లభస్నేహకృ
త్పౌలస్త్య పెడనాభిధాన- ౮౯

మ. బగుతుం డెంతయు నాజవంజవ సుఖభ్రాంతిం దగుల్కొన్న నీ
జిగి యజ్ఞానముగాదు వాని యెడ కౌచిత్యంబు గాదేని పై
నిగుఱుల్ గప్పిన నిప్పునందు సెకలేనేలేదె నాసామి నీ
వగవేలా పెడనాభిధానశివ- ౯౦

శా. ప్రాదుర్భావవివేకమర్కటకిశోరన్యాయ మింపొంద మీ
పాదాబ్జంబులనంటి జంటగనుఱేవ న్మామనఃపుష్ప మా
మోదం బైనది యందుఁ బొందుగఁ జిదాభోగంబు నీకెందుకీ
వాదంబో పెడనాభిధానశివ- ౯౧

శా. పూనన్లేద బిడాల మాత్మశిశువుం బొందానె నాపిల్లలై
తేనేతీఱువఁ ద్రిప్పినం దిరుగు నింతేకాని నావల్ల నే
మానయ్యా ననుఁ గన్నతండ్రి విలఁ జోద్యంబే పుదిన్నీ కుమా
ప్రాణేశా పెడనాభిధానశివపూ. ౯౨

మ. పలుమాఱుం బలుకం బనేమిపుడు నా భాగ్యంబహో దేవ భూ
తల నిత్యోత్సవ నీవు నేననెడి భేదంబూడ్చి నిన్నాటపా
టల ముప్పూటలు గొల్చెదన్ భ్రమరకీటన్యాయసంసిద్ధి తా
వలమయ్యెం బెడనాభిధానశివ- ౯౩

మ. ఘటజన్మార్చితపాదపద్మ నిజభక్తిస్వాంతరాజీవ వి
స్ఫుటలీలామణిసద్మ సంహృతజనస్తోమాతిదుర్దాంతహృ
జ్జటిలచ్ఛద్మసమస్తయోగి సుమనస్సంవేద్య విద్యుజ్జటా
పటలీభృత్పెడనాభిధానశివపూ. ౯౪

మ. శ్రవణానందముగా భవన్మహిమ లశ్రాంతంబు నే వింటి నీ
నవహేలాకృతి లోచనోత్సవ ముదీర్ణం బైతగం గంటి మ
ద్భవబంధంబు విడంగఁ గొంటి నిను నీ భక్తుండనై మంటి గా

రవ మబ్బుం బెడనాభిధానశివపూర్వస్వాద్యగస్త్యేశ్వరా. ౯౫

మ. మొదటం దెల్పని గొంత ముందెలియకేమో కొంత భాషించితి
న్మది దూషించితి నిన్ను నేమయినను న్మన్నించు టర్హంబు మ్రొ
క్కెద నే దాసరితప్పు దండమున నా కీడెంచి మేలెంచ సం
పదగల్గుం బెడనాభిధానశివ. ౯౬

మ. నతపంతాన భవత్ప్రసాదమునఁ జూర్ణప్రాయమై మత్పురా
కృతదుష్కర్మపితాన మంతయుఁ దొలంగె న్నిత్యలింగార్చనా
రతి సాఫల్యముఁ జెందె నామతిఁ బునర్జన్మం బలభ్యంబు సు
వ్రతినైతిం బెడనాభిధానశివ. ౯౭

శా. నావృత్తాంతము విన్నవించితి సకృత్సన్నింబాత యాలించి తీ
వానందైనఁ గొఅంత లేదు కడుమే లయ్యె న్ననేకాక నీ
సేవ న్సుస్థిర మైన ముక్తి నను డాసె న్నీవు నుం దోడుగా
రావచ్చుం బెడనాభిధానశివ. ౯౮

శా. ప్రారంభంబున నిన్నధీశ్వరునిగా భావించి నే జెప్ప నొ
ప్పారం బూనిన నీసుభక్తిశతకం బయ్యెం బ్రపూర్ణంబు చే
తోరూఢిౕ మఱి చిత్తగించి ముదితాత్మంజేసువే సద్గుణా
పారీణా! పెడనాభిధానశివపూ. ౯౯

శా. ఎన్న న్వాక్కుల సన్నుతింతు నను టింతేకాని తత్త్వాశలం
బెన్న న్నీస్తుతి గాదె కాన మఱి నీకే చెల్లు నిందెట్టి త
ప్పున్నన్నన్ను క్షమించి కాచుకొనునుద్యోగంబు దూరీకృతా
పన్నార్తా పెడనాభిధానశివపూర్వస్వాద్యగస్త్యేశ్వరా. ౧౦౦

శా. భావింపన్ జనులెల్ల నీభువి భవద్భవ్యాభిధానాంకితం
బై వాక్చాతురి మీఱి సుస్తుతిహితం బాచంద్రతారార్కముౕ
... ... ... ... ... ౧౦౧

శా. శ్రీమంతు ల్మతిమంతు లుజ్జ్వలయశశ్శ్రీనాధసీమంతిపి
సామంతుల్ ఘనుకౌందురీనగరసంస్థాను ల్సదావృత్తినీ
నామోచ్చారణనిష్ఠఁ జేసి మఱి దీనత్రాణపారీణతా
ప్రాముఖ్యు ల్పెడనాభిధానశివ. ౧౦౨

శా. శ్రీయుం జేయును బాపు నాపదల నుర్వి న్నీమహాప్రార్థనం

బాయుర్వృద్ధి యశస్సమృద్ధి హితవిద్యాబుద్ధిసంశుద్ధి ని
శ్శ్రేయస్సిద్ధి యొసంగుఁగాత నిరతశ్రీరస్తు మత్సంగత
ప్రాయస్తే పెదనాభిధానశివ. ౧౦౩

శా. చిల్లీలాకృతి మల్లికార్జునఇతి శ్రీపండితారాధ్యహృ
త్ఫుల్లాంభోజవిహార భూరివిలసత్పుష్పంధయస్వామివై
మల్లంపల్లి వసించియున్న త్రిజగన్మాన్యాంఘ్రి వీవంత్ర సం
పల్లీనా పెదనాభిధానశివపూర్వ. ౧౦౪

శా. గంగాభోగవతీభుజంగ సుజగద్గ్రై వేయకోత్తుంగ సా
రంగాస్వప్నవిపక్షభంగ కరసంప్రాప్తైకసారంగ సా
రంగాంకప్రథితోత్తమాంగ మృదుసారంగీదృగార్యాపరి
ష్వంగాంగా పెదనాభిధానశివపూర్వస్వాద్యగస్త్యేశ్వరా. ౧౦౫

మల్లంపల్లి మల్లికార్జునపండితారాధ్యవిరచితము.

సంపూర్ణము.

ఈశతకము

జగ్గయ్యపేఁటనివాసులు బ్ర॥ ములుగు వీరభద్రశాస్త్రిగారిచ్చినది.

---

శ్రీరస్తు

# 3. మన్నారుకృష్ణశతకము.

కైఁడిపాటి వేంకటనృసింహకవి.

---

## సీసపద్యములు.

### (1) స్తుతిదశకము

శ్రీరుక్మిణీరమాక్రీడాకళాసత్య సత్యభామామనోజలజమిత్ర
మిత్రవిందాధరామృతపానచాతుర్య తుర్యకాళిందీనదీప్రసంగ
సంగమసుపుణ్యలక్షణలక్షణాధీన ధీనయనాగ్నజితీప్రసాద
సాదరసల్లాపజాంబవతీలోల లోలదృగ్భద్రాముదాలవాల
వాలఖిల్యాదిమునిసంస్తవప్రభావ, భావమున నెంతు నిను విష్టపప్రచారుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧

పద్మావతీమన పంకజసారంగ రంగదంభోధిపర్యంకమోద
మోదకభుక్త్రాతసాదరసాంగత్య గత్యంతరాభావఖచరరక్ష
రక్షశ్చమూమహారణ్యపావకకీల కీలాలభృత్తుల్యనీలవర్ణ
వర్ణమాలాజహోదీర్ణమంత్రాధార ధారణాయోగమేధావివరద
వరదయామతికుజనధూర్వహమునడువ, నడువ వేమందకని వేఁడుపుడమి నెంతుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨

ప్రకృతికార్యేతరప్రబలనిత్యానంద నందనీకృతశతానందకామ
కామాదివర్గతమోమహితాదిత్య దిత్యపత్యసరోనదీననాగ -
నాగలోకవిభుత్వభోగభోగిశయాన యానవేగఖగాధిపానిశాశ్వ
శాశ్వతవసుఘనైశ్వర్యదనామాంక మాంకస్థలలితోత్తమాంగదేవ
దేవకీకుక్షి వెడలి పితృస్మపరిగె, పరిగొనని వేఁడురుద్రాదిసురల నెంతుఁ, జారు.

నిఖిలవేదాంతోపనిషదర్థసంభావ్య భావ్యతీతశుభాశుభద్వయజ్ఞ
యజ్ఞపర్యవసానహవ్యవపాహార హారకుండలభూషితాంగబృంద
బృందారకాష్టదిగీశరక్షణదక్ష దక్షాధ్వరాహితదైవమాన్య
మాన్యత్రిభువనసామ్రాజ్యసంపద్భోగ భోగసంభృతపరిస్ఫుటమహీన
హీనమతివత్సబాలుర నెత్తిదాఁచి, దాఁచియుతనైతినని వేఁడుధాత నెంతుఁ, జారు.

విశ్వసృష్టిస్థితివిలయకార్యనిదాన దానకృజ్జనకల్పతరుసమాన
మానసపూజావిధానహృష్టస్వాంత స్వాంతరింద్రియజిదార్యప్రణామ
నామజపావృత్తిసీమవచోవాస వాసనాత్రితయనివారచతుర

చతురంతజాతిసంస్కారపరిష్కార కారణాచార్యయోగప్రసిద్ధ
సిద్ధవందితచాలవర్ధించిమరల, మరలఁ బొలిసితినని వేఁడు మఘువుఁ దలఁతుఁ, జారు.
గంగానదీజన్మకారణపదపద్మ పద్మామనోహారావచితిధిషణ
ధిషణామంత్రేతరదితిజభంగవిచిత్ర చిత్రాంశుతేజోవిశేషబీజ
బీజవత్పుషితనానాజీవపరివార వారణేంద్రఘనస్తవప్రియాత్మ
యాత్మకళాలోకనాశ్యతుర్యాసన్న సన్నహనాసురసైన్యహరణ
హరనరేంద్రార్చితశ్రీపదారవింద, వింద వైతివియని వేఁడు విదురు నెంతుఁ, జారు.
ఉభయపార్శ్వవిభాస్వదుదధికన్యాగోత్రి గోత్రజేశస్తుతఘోరకీర్మ
కిర్మత్రయీబద్ధకవిమానసాసాధ్య సాధ్యచారణసమర్చ్యప్రసన్న
సన్నద్ధమధుదైత్యసముపేతసంగ్రామ గ్రామణీగుణశార్ఙ్గ నామధర్మ
ధర్మాదిపురుషార్థప్రదతాత్పర్య పర్యంకకృచ్ఛేషఫణికులేశ
లేశమునునిన్ను వివరింప లేకనాఁడు, నాఁడనవ్వుదునని వేఁడునరుని నెంతుఁ, జారు.
సనకాదిమునిమనశ్చరదంఘ్రిరాజీవ జీవతనుత్రయస్థిరనిశాంత
శాంతమానసజనైకాంతదృక్సుముదిత ముదితానుసంధానమునివితాన
తానగానచణత్రిదశమానియోగార్హ్యాగార్హపత్యాద్యగ్నిగతవపాద
పాదసంక్రాంతదిక్పతికిరీటస్తోమ సోమసూర్యగ్రహాసురుచిరాక్ష
రాక్షసాంతకదివ్యవిగ్రహాఖసూచి, సూచినక్లైంతుననినభీష్మునినుతింతుఁ, జారు.
ప్రతిదినాకాంక్షితపద్మాస్వయంగ్రాహ గ్రాహపీడితగజకష్టశమన
శమననందనరిపుక్షయదిగ్విజయమూల మూలప్రకృతికార్యజాలఖేల
ఖేలాంతరాళస్థలీలాచిదాభాస భాసమానసువర్ణభావుకపట
కపటనాటకకృతోద్ధత జగద్వ్యతిరిక్త రిక్తసాధువిపత్సరిత్సుతరణి
తరణినిభనీహితోక్తులవిరిసెఁదమము, తమముఖముగంటిననినయుద్ధవుగణింతుఁ,
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯
శ్రీయాదవాన్వయశ్రేయస్సరోహంస హంసశీతాంశుదివ్యావలోక
లోకేశలీలావివేకకార్యవికల్ప కల్పద్రుసురధేనుకల్పదాన
దానవగణమహీధరమహోగ్రశతార తారాభదధికణాకారకలిత
కలితమస్వాంతముష్కరదర్శనాభావ భావజముఖతనూభవనికాయ
కాయపరిదిగ్ధదుగ్ధప్రకాశమాన, మానసీసేవనిల్వునామానసమునఁ,
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦

## (౨) దాససంగతిదశకము.

... రాజ ద్విజరాజగమనావతీర్ణభువన
... పద్మాప్తచేటీతపస్సపర్య
... కృపానాదర నాదరహాస్యానుమోదచిత్త
... నానాటక నాభీరణద్వ్రిహీణ ప్రసంగ
... ప్రపన్నాపరాధి, రాధికాగోపనృపవధూరత్నజార, చారు
... కలందనాలోల నాలోలవృత్తి నెన్నంగఁబోకు
... నాహీన నాహీనకృత్య మెన్నంగఁబోకు
... నాక్రూర నాక్రూరచేష్ట లెన్నంగఁబోకు
... నాచల నాచలచిత్త మెన్నంగఁ బోకు
... నాభాగ్య మేమొకాని, కాని నీసేవ నేఁటికి గలిగె నాకుఁ
... మందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౨
... యుష్మదాస్యంబు దాస్యంబు సేయని తామసులకుఁ
... భవదీయప్రభావంబు భావంబుచలియించు పామరులకు
... వేంకటభృద్ద్వేషంబు ద్వేషంబుమదినొప్ప ద్రిమ్మరులకుఁ
... భవదవలోకంబు లోకంబునడకల ప్రాకృతులకు
... ములచే నలరు జడునిఁ, జెడు నిరర్థకు నను దరిజేర్చు టెట్లు
... మందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౩
... చేచాలవా చాలవాచాలకశక్తి గలిగి
... వినఁగోరవా గోరవాకర్ణనకుతుక మెటేఁగి
... యభయ మీఁజేరవా జారవామాక్షులసఖ్య మెటేఁగి
... వాడవా వాడవాడల ముచ్చు జాడ లెటేఁగి
... యున్న, యున్నతస్థాన నాదైన్యముడుపఁగదవె
... మందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౪
... మమ్మేలుకో మేలుకోయని దయామృదులహృదయ
... నన్నాదుకో నాదుకోరికలిచ్చి నలిననాభ
... నన్నుఁ జేపట్టుకో పట్టుకోకలు మొలఁగట్టుశౌరి
... పుణ్యాంబు గట్టుకో గట్టుకోమలపాణిఁ గట్టినహరి
... పలుమాఱుఁ జెప్పకుందు, కుందునామదిదైన్యంబునొందనీకు
... మందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౫

ంప లేఁడయా ప్రభువెందు నీకన్న నీకన్నబిడ్డని, వీఁక నెన్న
పతితుండు లేఁడయా పరికింప నాకన్న నాకన్నమహినొప్పు నరులలోనఁ
బడుచున్నపాటు లెప్పుడుఁ జెల్పనా విన్న నావిన్నఁదన మింకఁ బోవఁజూడు
గతినీవె లేరికఁ గడతేర్పనాయన్న నాయన్నమాటల న్యాయ మెఱఁగి
ముది నిజం బని కరుణ నన్నేలితేని, తేనియఃధంబు నీకథలానలేనె, చారుగా
ంతునిదె నాకువిత్వంబు తాళిరా తాళరాగైక్యనృత్యప్రమోద
వె దైవము నాకు నీపదమానరా మానరా జాగు రామానుజన్న
నాకింత కెన్నిజన్మంబులో యెంచరా యంచరాయనిసాదిఁ గాంచినవారి
ప్రబలతాపత్రయబాధల కోపరా కోపరాగస్వాంతకుజనదూర
యురసియిఁకనైన నామొఱ నాలకింపు, కింపురుషయక్షగంధర్వకృతసపర్య-
పనేర్చునే శ్రేయోనిశాంతంబు శాంతంబు నావంటిచపలమతికి
మకూడనేర్చునే సంపన్నిదానంబు దానంబు నావంటి హీనగతికిఁ
జేకూరనేర్చునే చింతావియోగంబు యోగంబు నావంటి భోగరతికిఁ
బొసఁగంగనేర్చునే భూతహితత్వంబు తత్త్వంబు నావంటి దైన్యకృతికిఁ
గాన నిటువంటి పతితుఁడనైన నాకు, నాకుజాతునికట్ల నీనామమబ్బెఁ, జా.
ర్వములు రుక్మిణీసత్యభామలు భామల్మస్మితముఖులై వసింప
యోష్ఠమునఁ గరాన్వితవేణుకాండంబు కాడంబునించురాగమున నొప్ప
శయద్వయిని మానితశంఖచక్రముల్ చక్రము ల్వెలయు తేజమునఁ దనర
మేన నిర్మలహేమాభవాసంబు వాసంబు దీపించు వన్నెనలర
దుటఁగస్తురితిలకంబువొదలమించు, మించునీమూర్తిఁగాంచిసేవించువాఁడఁ-
కృతామ్నాయభావనాచరణము ల్చరణముల్వ్యత్యస్త సరణి నిలిపి
యుశ్రాంతసంశోషితాభీరవంశఁబు వంశంబు మోవిపై వఱలఁజేసి
వర్షావసరచర ద్వారిదాబర్హంబు బర్హంబు మౌళి నేర్పడ ఘటించి
తిభూభయంకర దేవతాసుముఖంబు సుముఖంబు నోరగా సొంపొనర్చి
వట్టి నీదివ్యమగు తేజ మసువియోగ, యోగవేళఁ గనంబడు నొక్కొ నాకుఁ
జారుతరమందహాసపోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౦

## — (౩) పితృమాతృదశకము. —

దలనె బ్రహ్మంబు పదునాల్గుభువనము ల్భువనము ల్బొంకిగాఁ బూనెఁ గుక్షి
వంతనే విభుఁడాద్యుఁడై మహదాదుల దాదులఁగా స్వతంత్రత విధించె

కవి నేమేధావి జీవపార్శ్వస్థుఁడై స్వస్థుఁడై వటపత్రశాయి యయ్యెఁ
జెలఁగి యేదేవుండు సృష్టిసంధాతను ధాతను నాభిపద్మమునఁ గాంచె
నట్టినిను దేవకిపిచండమందు దేవ, దేవ నవమాసములు మోచి తిరుగుటరిది
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౧
శంఖచక్రగదాసినాధవ్యోక్షరములు కరములు నాలుగు పరిఢవిల్ల
ధృతకిరీటాధరీకృత భాస్వదస్తంబు మస్తంబు నిస్తులమహిమ నొప్ప
లలితరేఖాభాసిలక్షణాస్పదములు పదములు పల్లవప్రభల నలరఁ
బూర్ణప్రతీకస్థభూషానికాయంబు కాయంబు దివ్యమంగళతఁ దనర
నెసఁగునిటువంటినినుఁబుట్టింటఁగన్న కన్నతలిదండ్రులెంతసంపన్నులొక్కొ.
ప్రచలితహేమాద్రిపక్షావిశేషుఁడై శేషుఁడై పూనె నేజితజద్ధాత్రి
విధినిశివేళ నుదధిఁ బాఱుమత్స్యమై మత్స్యమై త్రిప్పె నేమహితకీర్తి
తరువంగఁ గ్రుంగు మంధానాద్రిఁ గూర్మమైఁ గూర్మమైమోచె నేధర్మవర్తి
యతలస్థమహిఁ దిరస్కృతసోమఘృష్టియై ఘృష్టియైయెత్తె నేస్పష్టమూర్తి
యట్టినినుఁగొంచువసుదేవుఁడటరియమున, యమునదాఁటివ్రేపల్లెకునరుగుటరిది
ముందఱ నిడుకొని ముదుకనేర్పరిపాటి పరిపాటి తైలంబు శిరమునంటి
యూరువులందిడి యుదకశీకరములఁ గరములు సున్నితోఁ గలయ బులిమి
మృదులోష్ణధూతహరిద్రకృజ్జలముల జలముల దోయిట జలకమార్చి
కడువేగముగ మేనితడిని బయ్యెదనంట నెదనంటఁ జేర్చి పెంపొదవనొత్తి
కుత్తుకకు డాయఁజేతుల నెత్తిపట్టి, పట్టివచ్చి ముద్దుగొను తల్లి భాగ్యమే మొ-
నిటలస్థలిని జక్కఘటియించుఁ గావునఁ గావునఁ బోరిడి కలఁగు వేళ
బొమలక్రిందన రేఖ నమరించుభసితంబు భసితంబు కడు దుళ్ళి పడెడువేళ
నొకచెక్కిటను రక్ష నుంచు నంజనముచే జనముచేకొని ముద్దుగొనెడువేళ
మొలత్రాట నింగువ ముడిచిన ముడివెట్టు ముడివెట్టిపురుడంటి బడలువేళ
నందసతియిట్లునినులోచనముతఁగాంచి, కాంచినవధూటికధికంబుగాఁగఁ బెంచె-
ప్రక్కలో నిడుకొని పలుమాఱు జోకొట్టి జోకొట్టి పుణుకుచు జోలపాడఁ
బోరుపెట్టిన భుజంబునఁ జేర్చి చిచ్చోసి చిచ్చోసి యని వ్రేళ్ళఁ జిచ్చుకొట్టు
హాయి రేయనుచు నుయ్యాలనుంచి లాలించి లాలించి మెల్లమెల్లనఁ గదల్చు
బూచివచ్చెనటంచు బుసపెట్టి బెదరించి బెదరించి మీఁగాళ్ళఁ బెట్టియూఁచు
నిన్ను నిన్నివిధంబుల నిద్రఁబుచ్చి, బుచ్చిశిశువంచుఁ దల్లిపాలిచ్చు లేపి, చా.

వనమాలికేవలార్భకుఁడనంజనుబాలుఁ జనుబాలు గుడుపవే సమయమెఱిఁగి
వినఁజాలఁ బ్రొద్దాయె ననుచు నీవెన్నఁగా వెన్నఁగాచిననేత నన్నమిడవె
లీల నుయ్యాలఁ బవ్వళించి పెంపొంపుగాఁబొందుగానిఁకని ద్రపుచ్చఁదగదె
తడవాయె నిద్రించి తాళఁ డాఁకలికినో కలికి నేర్పున మేలుకొలుపఁగదవె
యనుచునందుండు నీతల్లినను మటప్పు,టప్పటికి పన్నుఁగాంచుమోహమునఁగాదె-
నునురావిరేక నెన్నుదుటిపై నలకల నలకలాపాగ్రణిమై మెలంగ
నురమునఁ బచ్చల నొప్పి యొప్పులెగోరు పులిగోరుపతకంబు పొంకమలర
నడుమున మణివితానపు మెఱుఁగంటు గంటలమొలనూలు గల్లురనఁగఁ
దళతళదివ్యరత్నప్రభావలయము ల్వలయముల్ హస్తాగ్రములఁ జెలంగఁ
దనరునీజానుయానంబు తల్లిచూచుఁ, జూచుకంబులఁ బాలిచ్చిచొక్కఁగాదె-
కుడువరాచను బువ్వగడియలోనుడుకు నే నుడుకు నేర్పననూఁదియిడుదు ననుచు
మీఁగడపెరుఁగుతో మెసవుమోగిరము వేగిరము వేడుకశుభాకృతియటంచుఁ
జెచ్చెర భక్షింపు చేకొని యీ వెన్న యీ వెన్న నేల నన్నెప్పు డనుచుఁ
ద్రాగురా నునుపంచదారతో నీపాలు నీపాలు సుస్మి తేఁబాప యనుచు
నిత్యమునుజిన్నిపాయపునిన్నభూత, భూతదయగల్గుజనయిత్రి బుజ్జగించుఁ-
శింశుమారస్థ దివ్యాంశువిగ్రహముల గ్రహములఁ దారల రాశికములఁ
బూర్వదిక్పాలావిపుటభేదనంబుల నంబులఁ దనరుసప్తార్ణవముల
భూజలాగ్ని మరున్నభోభూతగణముల గణముల దిశల నాకాశచరుల
నతలాద్యధోలోకగతఫణిస్వామిల స్వాముల జంగమస్థావరముల
మృత్తుఁ గనుమంచునీవునోరెత్తఁగాంచె,గాంచనాంశుక జననినీగర్భమందుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. 30

—(4) బాలదశకము —

నరుల కిందలిజీవనంబులు భంగముల్ భంగము లేవన ప్రతతియందుఁ
జరము లిందలి గోవృషశ్రీసురక్షము లక్షము లన నచరంబు లందు
నమృతాప్తికిందు ననాయాసమథనంబు మథనంబు లమృతసంప్రాప్తికందు
నిందవస్థలమూఁట నందాత్మచర్యలు చర్యలు రెండవస్థల నెయందు
ననికదా వార్ధిఁదొఱఁగిబాల్యమునఁబాడి, పాఁడిపంటలుగల్గు వ్రేపల్లెనుంట
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. 3౧

[illegible] మూర్తివి సారెకుఁ సారెకుఁ దొలువొత్తుఁ జప్పరించి
పిసికెఁ దక్కయి త్రి పృథుకుచాపారంబు పారంబుగలతనుస్తన్యమూని [వి
యుతశయనసంధ్యలయందు మన్గనాముదముతో ముదముతోఁ జనుబ్రాలుపిసుకఁ ద్రా
గుల్కుమాకీకృతాజన్నవికారంబు కారంబు వారసంగతిని గ్రోలి
యుట్టిచేతివిగా వెతన్నిశవానుభవము, భవముగలవారలకుఁ గదా ప్రాప్తమగుట-
నలుకకుంకిటిఁ గర్తియులఁ గూర్చునెమ్మది నెమ్మది వటపలాశమ్ముఁ దలఁప
కెపకెపఁజనుబ్రాలుగుడుచుఁ దానుడురుచినుడురుచి క్రతువపాహుతిదలంప
నా[illegible]జనమనోహరణమూనవలీల నవలీల లసి విభువ్యక్తి దలఁప
నథ్నితదధిభాండ మథనస్వనంబున నంబునర్గి రావంబు దలఁప
వంబపతిఖర్తచేనలోపంబునందు, నందుసంపత్తి గనుటవినోదె మఱపు-
కుంతలాభి భాస్వద్ముఖపద్మచేఁ బద్మచేఁ గను నొత్తఁబడిన వెవ్వి
పావకృస్తుంగభంగత్వగంగకు గంగకుభవజనకంబు లెవ్వి
యచలిత యోగియోగానుసంధాన ప్రధాన ప్రచారంబు లైన వెవ్వి
సకలవస్తాక్రమాచార విస్తృతులందు శ్రుతులందు నృత్యంబు ద్రొక్కెనెవ్వి
యిట్టి నీపాదములు నందునింట బెదరి
బెదరికని తప్పటడుగులు వెట్టుటరిది, చారు. ౩౪
పాలిష్టు డిమ్మని పటాంచలముఁ జంచలము చెందఁగఁ బట్టుసమయమందు
నెమ్మె వెన్నమొసఁగు మనిమంథదండంబు దండంబునిడి పట్టుతఱిని మఱియు
నవ్వుపెట్టవె బువ్వ యని లీల వ్రేలిచే వ్రేలు చేకొని పట్టువేళయందు
నప్పచ్చి దే తల్లి యని శుభాకరములు కరము లడ్డమువట్టు కాలమందు
నిట్టినీశైశవక్రీడలింతియెన్ని, యెన్నిపనులున్నమానినీయిష్టమొసఁగుఁ, జారు.
సతతభక్తితమఘాహుతిసరసాన్నంబు సన్నంబుగాఁ దిన సరణిమెసవ
సర్వవేదాకృతి స్వరపలుకులు పలుకులు గడుముద్దుగులుకఁ బలుకఁ
ప్రాణ్యంతరనుగత పాదపల్లవముల లవములగతి వీథి లగువులెత్త
స్తుతిరవాకర్ణనస్రుతివల్లవార్తల వార్తల సార్థక్యవ్యక్తి వినఁగ
నేర్చుకొను టద్భుతము గాదె నీవు మంద
మందచర్యలఁ బ్రాకృతమ్మార్తిమెలఁగి, చారు. ౩౫
ఆత్మాలయము దాఁటునంతకు నడుగున నడుగు నవీనకుహాకతనిడుచు
నవలివీథికిఁ బోవునంతకుఁ బదమెత్తి పదమెత్తితిన్నగాఁ బాడుకొనుచు

నరసి నేస్తులఁ గూడునంతకు నల్లన నల్లనఁ గనువారి నడిగికొనుచు
నచటఁ బెద్దుద్ది యౌనంతకు గొబ్బున గొబ్బునఁ గసరి కేగో యటంచు
నాటలకు వేఁటవెడలి ఘేయచుచునంత,నంతధూర్తశిఖామణివైతివౌర,చారు.

అన్న రా మనమాటలాడంగఁబోవలెఁ బో వలెవాటింకఁ బొసఁగదోయి
తల్లులు గనికొట్టఁ దలఁతురు మనముల మనములఁ గోపంబు మాన రెపుడు
వెన్న దొంగిలి తెత్తు విను మన కిరువుర కిరువు రథోదరం బీదినంబు
ఆటల కధికుల మయ్యు యీమందలో మందలోలాత్మడింభకులకన్న
ననుచు నమ్మించి సకలగుణాభిరాము
రాముఁ దోడ్కొని రాజమార్గంబుసారవె, చారు. ౩౮

సంహిత విని వచోర్ఘురిఁ బదక్రమముల క్రమములఁ దప్పక ఘనను చెప్పి
సాము చూచి ప్రయోగసంహార మనువుల మనువులస్మృతిరీతిమహిమలెన్ని
క్రయవిక్రయస్థితు ల్గని యాదివృద్ధుల వృద్ధులగతి వివరించి మించి
పనుల నన్నిటిఁ గాంచి బహువిధోపాయము ల్పాయముల్గల వారిఫణితిఁ దెలిపి
ప్రబలు నిను ముఖబాహూరుపాదజన్మ
జన్మబాలురు గని నిల్వఁజాల రెదుటఁ, జారు. ౩౯

గళదచ్ఛదధిపయఃకణ మై వశీకర శీకరకణము నిరాకరించి
లవరజస్సహితావయవ మై విభూతిద భూతిదనర్చు శంభుని నెదిర్చి
చలదలకాస్య మై జలదపోతాంజనతాంజనగిరి శృంగ మపహసించి
నవనీతదిగ్ధమై పవిభవాభాసిత భాసితహరినీల మోసరించి
భువనమోహనమగునీదుబుడుతమూర్తి, మూర్తిమంతంబుఁజూపినాయార్తినుడుపు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౪౦

## (5) చోరత్వదశకము.

ఉదయాద్రి నేధనాఢ్యుల కైనఁ జిక్కని చిక్కని పెరుఁగు వాసింప జుర్రి
ప్రొద్దు జామైన నేపుణ్యుల కందని కందని వెన్న నింపొంద మెక్కి
మధ్యాహ్నవేళ నెమ్మది నట్టుగట్టిన గట్టినయంపు మీఁగడలుమెసవి
యపరాహ్ణమున నెట్టనై తడవారిన వారినంటని పాలు వడిగఁ ద్రావి
ప్రతిదినం బిట్టిచోరకర్మప్రసిద్ధి, సిద్ధవడసితి వో మంద నుద్ధరింపఁ
జారుతరమంధహాస పోలూరి వాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౪౧

కాళియగర్వశోషణ జగచ్ఛ్రయపోషణ సింధుకన్యకా
కేళివిశేషణా కనకకీలితభూషణ మంజుభాషణా
వ్యాళవరేణ్యతల్పశయనాగతశోషణ ననుఁగావు మం, బాల. ౫౪
బాల మురారి కృష్ణహరి భక్తజనప్రియ వాసుదేవ గో
పాల నృసింహ కేశవ కృపానిధి దీనశరణ్య రామ మాం
పాలయ పాహిపాహి యని ప్రస్తుతిచేసి భజింతు నిన్ను నం, బాల. ౫౫
వాలివినాశమూలకరవాల హతాసురజాల భార్గవీ
లోల గుణానుకూల నతలోకవిశాల కృపాలవాల నీ
పాలఁదొలంగఁ జాల నను బాలన సేయవె తాళఁజాల నం, బాల ౫౬
గాలవనామదేవశుకగౌతమకౌశికశౌనకాత్రిజా
బాలిమరీచిగాధిరుచిపర్వతభార్గవముఖ్యమౌనిచి
త్తాలయవాస మామకహృదంతరభాసుఁడవై వసింపు మం, బాల. ౫౭
నేలవెలంది రావణవినిర్మితబాధల కోర్వలేక జే
జేలను గూడిపోయి విధిపీట మొరంగిడ నూఱడించి వా
శ్వాలుఁడు పాలవెల్లికడ ప్రార్థనచేసిన నిన్భజింతు నం, బాల ౫౮
ఓ లలితాత్మ రావణుని యుగ్రకృతంబుల కింద్రభూసురుల్
ప్రేలుచు రామరాత్ముని హరింపుమన న్విధికి న్నరుండనే
నైలయవెట్టు దంచు నభయంబిడు విష్ణుని నిన్భజింతు నం, బాల. ౫౯
హేళి నొకండవయ్యుఁ జతురాత్ముఁడవై తివనాఁగ నీకళల్
నాలుగు రామలక్ష్మణు లనన్ భరతుం డరిహుం డనా నమో
ధ్యాలయమందు దాశరథులైన తదాత్ముని నిన్భజింతు నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౬౦
బాలుఁడవయ్యు లక్ష్మణునిఁ బాయక తమ్ములఁగూడి యాత్మగే
హాళుల మజ్జనాద్యముల నాటలఁ బాటల రాకపోకలన్
హేలలఁ దల్లిదండ్రుల కనేక ముదంబిడు నిన్భజింతు నం, బాల. ౬౧
ఓలి ధరిత్రి నీ వుదయమొందు టెఱింగియుఁ గౌశికుండు నీ
ప్రోలికి వచ్చి నీ జనకు పూజలనొంది మఖావనార్థమై
తోలు మటంచు నిన్నడిగి తోడ్కొనిపోయిన నిన్భజింతు నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయా మనోహరా. ౬౨

కేల ధనుశ్శరంబులను గీల్కొని లక్ష్మణుఁగూడి మౌనిశా
ర్దూలుని వెంటఁబోవుచును త్రోవ నరణ్యములోన వాఁడి యౌ
కోలను ఘోరతాటకను గూల్చిన రాముని నిన్భజింతు నం, బాల. ౬౩
శీలితవృత్తిఁ గౌశికుఁడు చేసెడి యజ్ఞము గాక యుండఁగాఁ
జాలుపుగాను విఘ్నములు సల్పు సుబాహుముఖాసురేంద్రులం
గోలలువైచి కూల్చిన రఘుప్రభు రాముని నిన్భజింతు నం, బాల. ౬౪
శైలవిరోధి మోహమున స్వప్రభుమూర్తిని వచ్చి కేళులం
జాల వరించి పోవ పతిశాపమున న్వనిలో శిలాకృతిం
బోలి వసించు గౌతమునిబోటిని బ్రోచిన నిన్భజింతు నం, బాల. ౬౫
లాలితమూర్తితోడ మిథిలాపురిఁ జేరఁగఁబోయి యందు నా
శూలిశరాసనుం దునుమఁ జూచి విదేహుఁ డొసంగఁ ధాత్రిక
న్యాలలనామణిం బరిణయంబయి పెన్గెడి నిన్భజింతు నం, బాల. ౬౬
ఆలఘుభావవర్జితమహావిభవంబులఁ బెండ్లియాడి భూ
పాలుఁడు పెట్టి పంప నిజభామినితోఁ జని మధ్య మ్రోలికిం
బ్రేలుచు వచ్చు భార్గవుని బింక మణంచిన నిన్భజింతు నం, బాల. ౬౭
భూలలనాశిరోమణికి భూషణమైన యయోధ్యఁ జేరి యౌ
త్సాలయవీథులం దివమునందు శచీయుతుఁడైన యింద్రునిం
బోలి ధరాసుతారతులఁ బొందిసుఖించెడి నిన్భజింతు నం, బాల. ౬౮
ప్రోలికి రాఘవాగ్రణిని భూపతిఁజేయుదుటంచు నాగరుల్
చాలఁ బ్రశంస చేతు రని సర్వము యత్నమొనర్పఁజేసి భూ
పాలుఁడు పంపు సద్గురుని పల్కుల నుబ్బెడి నిన్భజింతు నం, బాల. ౬౯
ప్రోలి కధీశ్వరుండు తన పుత్రుఁడు నిన్ను నరణ్యభూమికిం
దోలఁగఁ గైక యా దశరథుం గరలించి వరంబులంద నాం
దోళన మంద కందు కతితోషమునొందిన నిన్భజింతు నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౭౦
తాలిమిశస్త్రచాపములు దాల్చి ధరాసుతతోడఁగూడి యా
ప్రోలు త్యజించి మాతృపితృపూర్వవరోక్తులు దీర్ప జాహ్నవీ
కూలమునందుఁ జేరి గుహుగోష్ఠి వసించిన నిన్భజింతు నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౭౧

సాలమృగద్విజాకులవసద్వనికేఁగుచు నధ్య గుల్మినీ
శాలలయం దగస్త్యముఖ సన్మని గోష్ఠుల నిల్చి యవ్వలన్
నేలుగఁ బోయి పంచవటిచేరి వసించిన నిన్భజింతు నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయా మనోహరా. ౭౨

కాలుని బోలి వచ్చు బలగర్వవిరాధు వధించి మోహినిం
బోలి వరించు శూర్పణఖ ముక్కు సెవుల్ తెగఁగోసి మించి యా
భీలఖరాదిరాక్షసుల పించ మణంచిన నిన్భజింతు నం, బాల. ౭౩

మేలని రావణుం డనుప మేటి ఖలుం డొకఁ డామృగాకృతిన్
మ్రోలఁ జరింప సీత మృగముం గొనితెమ్మన నేగి యాశరుం
బోలి మృగంబుగా కునికి పోఁడిమడంచిన నిన్భజింతు నం,బాల. ౭౪

నాలవయాశ్రమాశ్రయుఁడనాఁగ దశాస్యుఁడు వచ్చి ముచ్చటల్
చాల వచించి తోడనె నిజాకృతి దృష్టముఁజేసి బల్మి సీ
తాలలనం గ్రహించి చన దానికిఁ జింతిలు నిన్భజింతు నం,బాల. ౭౫

ఓ లతలార యో వటముఖోర్విజపుంజములార యో మహా
కోలతరక్షుముఖ్యమృగకూటములార ఖగంబులార సీ
తాలలనన్నెఱుంగరు గదా యని వేఁడెడి నిన్భజింతు నం,బాల. ౭౬

యేల మహీజ నెత్తుకొని యేగెద వంచు జటాయు వడ్డమై
యాలముఁ జేసి రావణహతాంగకుఁడై పడియున్న యమ్మహా
శాలికి నాకబంధునకు సద్గతు లిచ్చిన నిన్భజింతు నం,బాల. ౭౭

మేలయి పక్వమై రుచుల మించు ఫలంబులు దెచ్చి శ్రద్ధతోఁ
జాలిన యట్లు మీ కొసఁగి సత్కృతిఁ జేసిన మెచ్చి ముక్తి నం
శ్రీలలితాత్మ గాను శబరిం గరుణించిన నిన్భజింతు నం, బాల. ౭౮

గాలికి బిడ్డఁడైన ప్లవగప్రభుఁ డర్కసుతుండు పంప మీ
పాలికి వచ్చి మీ మతియు భానుజవృత్తి యెఱింగి యుర్వరం
దాలిమిసేయ మేలనిన దానికి మోదిలు నిన్భజింతు నం, బాల. ౭౯

వాలినిఁ జంపి తత్పురము వైభవమిత్తును నీకు నీవు నా
గోలను గొన్న దుర్మదుని గూల్చ బలంబిదె యంచు సాక్షిగా
గీలిని జేసి భానుజున సఖిత్వ మొసర్చిన నిన్భజింతు నం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౮౦

వాలిని బిల్చి యర్కజుఁ డవార్యరణం బొనరింప వల్లికా
శాలల నుండి వాలి నొక సాయకమేశి వధించి తత్పురిన్
నేలుగ నర్కపుత్రు నభిషిక్తునిఁజేసిన నిన్భజింతు నం, బాల. ౮౧

నీలనలాదివానరు లనేకుల రాఁగొని యందుఁ గొందఱి
న్నాలుగుదిక్కులం జనకనందిని జాడ లెఱింగి రా వెసం
దోలిన భానుపుత్రునకుఁ దోడ్పడఁ బల్కెడి నిన్భజింతు నం, బాల. ౮౨

వాలిజవాయుజప్రముఖవానరవీరుల దక్షిణాశకుం
దోలఁగ నందు మారుతసుతుం గని యుంగరమానవాలు నా
యాలి కొసంగి తత్కుశల మారసిరమ్మను నిన్భజింతు నం, బాల. ౮౩

ఆలఘుమూర్తి యుక్తుఁ డనిలాత్మజుఁ డంబుధి దాఁటి లంకలో
శాలలఁ దోఁపుల న్వెదకి జానకిఁజూచి వాతద్రుమాత్ముఁడై
శాలలుగాల్చి రా న్వసతి జాడ లెఱింగిన నిన్భజింతు నం, బాల. ౮౪

శ్రీలలనావిభుండు రఘుశేఖరుఁ డాతని పత్ని యెటిరా
మాలి ఫణీంద్రుఁడాఘనునిసోదరుఁ డంచును దమ్ముఁడన్న కే
నీలలితాదివృత్తము గణించెను యానినుసేభజింతు నం, బాల. ౮౫

కూలిరి నీ సుతుల్ సఖులు కూడదు వైరము మ్రొక్కి యాదయా
ళాలికి సీత నిమ్మన దశాననుఁ డంఘ్రులఁ దన్న వచ్చి న
న్నేలుమన న్విభీషణుని నేలినరాముని నిన్భజింతు నం, బాల. ౮౬

పాలికి వచ్చురాముఁడని భావమునం బ్రియమంది పొంగి నీ
పాలికిరాని వింటికొక బాణముఁగూల్చిన భీతి నబ్ధి నీ
పాలికివచ్చి త్రోవ దెలుపం గని ప్రోచిన నిన్భజింతు నం, బాల. ౮౭

వాలిసుతాంజనేయ ముఖవానరసంయుతుఁడై నలుండు దా
శైలశిలాద్రుమంబులను సల్పిన సేతువుమీఁద సేనతో
వాలవణాబ్ధిదాఁటి చని యవ్వలఁజేరిన నిన్భజింతు నం, బాల. ౮౮

ఈ లవణాబ్ధిదాఁటె ప్లవగేంద్రులు రాముఁడు వచ్చె నిందు నం
దాలము సేయు వారిఁగనెదంచు దశాస్యుఁడు మేడ లెక్క నీ
కోలను వసి చేయు గొడుగుల్ దెగవైచిన నిన్భజింతు నం, బాల. ౮౯

పేలవ మొందుచోఁ బిదప బీర మెలికించుక గల్గి రావణుం
డాలము సేయఁ బంచిన మహాసురకోట్లను లంకచుట్టు గా

నీలనలాదులం బనిచి నీల్గఁగఁ జేసిన నిన్భజింతు నం, బాల. ౯౧

నేలకు నింగికిం జనుచు నిక్కుచు మాయలచేఁ గపీంద్రులం
గూలఁగఁ జేయు రావణునకుం దనయుం డగు నింద్రజిత్తు దు
శ్శీలునిఁ బోర లక్ష్మణునిచేఁ దునిమించిన నిన్భజింతు నం, బాల. ౯౨

ఆలయవేళ సర్వము లయం బొనరించెడి ఫాలనేత్రునిం
బోలి కపీంద్రసైన్యములఁ బోరుచు వచ్చెడి కుంభకర్ణు ని
ర్గోల ధనుస్సున న్విడిచి కూలఁగ నేసిన నిన్భజింతు నం, బాల. ౯౩

కాలయముండె పోలె బలగర్వమున న్రథమెక్కి వచ్చి యా
భీలరణం బొనర్చు రణభీము దశాస్యు శిరంబు లుర్విపై
రాలఁగ బ్రహ్మనామక శరంబునఁ ద్రుంచిన నిన్భజింతు నం, బాల. ౯౪

నీలవితానము ల్మణికనిర్మితకేతువులు న్సువర్ణర
త్నాలయము ల్వెలుంగఁగ మహోత్సవంబుల నొప్పు లంకలో
ధీలలితు న్విభీషణుఁ బ్రతిష్ఠితుఁ జేసిన నిన్భజింతు నం, బాల. ౯౫

వాలిసుతానిలాత్మజదివాకరపుత్రవిభీషణాది ధీ
శాలుల లక్ష్మణుం ధరణిజాతను గూడుక పుష్పకంబునం
దోలి వసించి వెల్గుచు నయోధ్యను జేరిన నిన్భజింతు నం, బాల. ౯౬

తాలిమి మ్రోల వాయుజుఁడు తమ్ముఁడు వెన్క నిజాంకమందు ని
ల్లాలిరుఁ గ్రేవలందు భరతారిహు లొప్ప వసిష్ఠముఖ్య స
చ్ఛీలురచే నయోధ్య నభిషేకము నొందిన నిన్భజింతు నం, బాల. ౯౭

ఆలయవేళఁ గేవలమహాసురశేఖరుఁ డైన సోమకుం
గాలునకిచ్చి వేదములు గైకొని ప్రోచుచు లోకపంక్తికి
న్మేలును గల్గఁజేయు బలుమీనము వైన నిను న్భజింతు నం, బాలపు. ౯౮

వేలుపు లాసురల్సురసవృత్తిని మందర మెత్తి తెచ్చి యా
పాలకడందిలో నునిచి పట్టి మథింపఁగఁ గూర్మమూర్తివై
శైలము వీఁపునఁ న్నిలుపఁజాలిన నిన్భజియింతు నెప్పుడం, బాలపు. ౯౯

నేల గ్రహించి చంక నిడి నీటఁ దొలంగిన పాఱు నమ్మహా
భీలబలాఢ్యు ఘోరరణభీషణుఁ గాంచననేత్రుఁ ద్రుంపఁగాఁ
గోలము వై పురాకృతిని గుంభిని నిల్పిన నిన్భజింతు నం, బాల. ౧౦౦

వేలుపుఁ బెద్ద నేకమతిఁ వేఁడి వరంబులఁ జెంది మృత్యువుం
బోలి చరించు హేమకశిపుం బరిమార్పఁగఁ దత్సుతు న్సదా
శీలుని బాలు నేల నరసింహము వైన నిను న్భజింతు నం, బాలపురీ. ౧౦౧

నీలలితైకభక్తి జితనిర్జరనాథబలిప్రదానముల్
కేల వహించి దేవతతికిం గరుణింపఁగ మూఁడులోకముల్
కాలనె కొల్చి పుచ్చుకొనఁగాఁ గనువామను నిన్భజింతు నం, బాల. ౧౦౨
లోలితవృత్తి నెమ్మదిని లోభమదంబులు గల్గుదుష్టభూ
పాలుర మస్తకంబులును బంధురతాళఫలంబు లుర్విపై
రాలినయట్లు రాల్చుభృగురాముఁడ వైన నినున్భజింతు నం, బాల. ౧౦౩
స్త్రీలకు నాకవాసులకు శిష్టమునిద్విజకోటి కష్టది
క్పాలురకుం జగంబులకు బాధ లొనర్చెడి రావణాదిదై
త్యాలినడంప దాశరథివైన మహాత్ముని నిన్భజింతు నం, బాల. ౧౦౪
కాలఫణీంద్రతుల్యు లతిగర్వులు ధేనుకముష్టికాదులుం
గాలముసేయ కంసనరకప్రముఖు ల్లయమొంద గోపికా
కేళులఁ దేలఁ బూను బలకృష్ణమయు న్నినునేభజింతు నం, బాల ౧౦౫
శీలము సాధువృత్తి పతిసేవ శమంబునుగల్గి యాపుర
స్త్రీ లొనరించు సద్వ్రతవిశేషమహత్త్వము భంగపెట్టఁగాఁ
జాలిన బుద్ధరూపుని బ్రసన్నుని విష్ణుని నిన్భజింతు నం, బాల. ౧౦౬
చాలనిబుద్ధి చాలనివిచారము చాలనివర్తనంబులుం
జాలఁగఁ గల్గి పాపములు సల్పెడి తత్కలిదోషయుక్తులం
గూలఁగఁ గల్కిమూర్తివయి కూర్మివహించిన నిన్భజింతు నం, బాల. ౧౦౭
మేలులు గల్గుఁ గీడులు శమించును దుష్కృతకర్మరాసులుం
దూలును బెక్కుసంకటలు దోఁచును ముక్తి గలుంగు భక్తినే
కాలము నీదుపద్యశతకంబు లిఖించి పఠించువారి కం, బాల. ౧౦౮
నాలుకచేత నామనమునందు వసించి వచింపఁజేయు నీ
కాలమునందుఁ బద్యశతకంబు రచించితి దీనిఁ దత్ప్రభా
శాలి తదంశమాలి గలకాల మిల న్వెలయంగఁ జేయు మం
బాలపురీశ రాఘవనృపాల మహీతనయామనోహరా. ౧౦౯
నిపుణత గల్గి యాసగుణనిర్గుణతత్త్వకవిత్వకల్పుఁ డ
య్యు పరశురామపంతుల కులోదధసోముఁడ రామమూర్తి ప్రా
ణ్యుకకృతిగా వహించి యొక యుత్పలపద్యశతంబుఁ జేసె నీ
విపుల వెలుంగఁ జేయు రఘువీర మహీతనయామనోహరా. ౧౧౦

శ్రీ

# ౬. మనశ్శతకము.

పరశురామపంతుల లింగమూర్తికవి ?

---

—। కందములు ।—

శ్రీనారాయణగురు సీ,తానాయకుఁగాఁ దలంచి తత్పాదాబ్జ
ధ్యానానందముచే ని,త్యానందముఁ బొందుమెపుడుఁ దలఁగకమనసా. ౧
అఱగడియలోన రాముని, సిరిఁబొందఁగ నొక్కయుక్తిచేఁ దెలిపిన శ్రీ
గురునారాయణయోగుల, మఱవకుమీ రాముఁ డతఁడు మహిలోమనసా.
సకలము దృశ్యము నాత్మని, యకలంకంబైన దృష్టి యాత్మని తగ నీ
యొకయుక్తిముక్తిఁజేసిన, సుకరు న్నారాయణేంద్రుఁ జూడుము మనసా. ౩
తనుకరణంబులు తాఁ గాని, తనుకరణవిలక్షణుంబు తానై భువినే
ననుజీవభావ ముడిపిన, ఘనునారాయణుని రాముగాఁ గనుమనసా. ౪
మాఱుగనిభోజన మిది,గోరా యిది తినకతిని యగోచరతృప్తిఁ
శ్రీరామునిఁ గనుమనుగురు, నారాయణుచరణయుగము నమ్మవెమనసా.
ఎఱిఁగిన యెఱుకలు నుఱవుము, మఱవని యెఱుకెఱిఁగి యెఱుకమఱపుల నెన్నం
డెఱుఁగని నెలవున నిముమని, గుఱిదెలిపినగురుని గుఱిని గూడుముమనసా.
యోగంబు లన్ని యిహపర, భోగోద్యోగములు లోకపూజ్యములగు న
య్యోగమములఁ జెడిపోవక, వేగము రాగనిధిఁజంపు వెలయఁగమనసా.
మతములు నిర్వాణపద, ప్రతిబంధకములు ప్రపంచ పదనులు మాయా
కృతములు గావున వాని, స్మతిఁ దలఁపక రాముఁబొందు మఱవకమనసా.
మంత్రంబులన్నియును నడు,మంత్రంబులు లేనిపోనిమాటలు సుమీ యా
తంత్రములఁ జెడక యాపర,తంత్రుని రాముని దలంపు తలఁపునమనసా.
జపములు తపములు వ్రతములు, విపరీతపుడాంబికములు వేషము లగుటం
జపలత నొందక సద్గురు, కృపరాముని శరణుఁబొంది కేరుముమనసా. ౧౦
గారడపుయోగములచే, నాఱడిఁబొందక ప్రపంచమంతయు మాయా
కారం బని చూచుచు సీ,తారాముని సాక్షిగాఁగఁ దలఁపుము మనసా. ౧౧
అంబరగమనాదులు గడు, డంబమ్ములు మానవులనొడంబఱిచెడి యో
గంబు లవిగోరక నిరా, లంబుని భద్రాద్రివిభుఁ దలంపుము మనసా. ౧౨

చదువు లిలఁ బలుతెఱఁగుల, వదరున్ దస్తురపువాని పగిది నవియె తగన్
దుదముట్టనియవు గావునఁ, జదువులలోఁ జదువు రాముఁ జదువుము మనసా.
వేదంబు లగాధంబులు, వాదంబుల బహువిధావవాద విరచితో
న్మాదంబులు గావునఁ ద, ద్భేదంబులఁ బడక రాము ధృతిఁగనుము మనసా. ౧౪
స్నానజపహోమమంత్ర, ధ్యానాదికకర్మములు మహాడంబకముల్
గానఁ దలపోయ కవి సీ, తానాథుని సర్వసాక్షిఁ దలఁపుము మనసా. ౧౫
భువి దూరదృష్టి దూర, శ్రవణాదులు మాయ లని విచారింపుము స
త్త్వవిజనవినుతుని సీతా, ధవుని యనాద్యముగ నరసి తలఁపుము మనసా.
వాయువిరోధనముల నిజ, కాయంబులు సిద్ధి సేయఁ గడఁగినవారల్
మాయాకాయికు లని లోఁ, బాయని రాముని దలంపు వ్యస్సుగమనసా.
మాయ లిల లక్షలక్షలు, కాయికములు కోటికోట్లు గాన నఖిలముల్
మాయాకార్యము లని సీ, తాయుతు భద్రాద్రివాసుఁ దలఁపుము మనసా.
తమతమయుక్తులచే ను, త్తమయుక్తులు గడచి యోగధారణలను వి
భ్రమఁ జెందుజనులఁ బుసహా, ధములని భద్రాచలేశుఁ దలఁపుము మనసా.
నిత్యానిత్యవివేక మ, సత్యం బని కాయికంబె సత్యం బని యా
చిత్తోక్తు లాడు జనుల న, నిత్యులఁ గాఁ జూచి రాముని గనుము మనసా. ౨౦
దేహం బెల్లాత్మని సం, దేహంపక దృఢము సేయు ధీరులు ప్రకృతి
గ్రాహగ్రస్తులనుచు నై, దేహీప్రభు నాత్మగాఁగఁ దెలియుము మనసా.
మును ప్రాణ మాత్మగాఁ గను, జను లవివేకు లని తెలిసి సంతతము ధరా
తనయాధిపునిఁ దలంపుము, గనుఁగొని ప్రాణాతిరిక్తుఁగా నొగి మనసా. ౨౧
నిను నాత్మగాఁ దలంచుచు, నవిశము వాదించువారి నతిమూర్ఖులఁగాఁ
గని సర్వనియామకు రా, ముని నంతటఁ జూడు భక్తిమునుకొన మనసా.
అలబుద్ధి యాత్మయనుచుం, బలుమఱు వాదించువారు పామరులు సుమీ
తలఁపఁగఁ బ్రజ్ఞాతీతుం, డల భద్రాచలనివాసుఁ డమలుఁడు మనసా. ౨౪
అజ్ఞానమాత్మ మని మోడి, ప్రజ్ఞాహీనులకు యుక్తి పాటింపరయా
విజ్ఞానపూర్ణరాము, న్సుజ్ఞానముతో ముదమునఁ జూడుము మనసా. ౨౫
అంతయు మాయామయ మని, చింతించుచు నిత్యసుఖముఁ జెందుము సుఖివై
తయు సచ్చిన్మయ మని, చింతించుచు రామచంద్రుఁ జేరుము మనసా.

శబ్దంబులు విను వేళల, శబ్దశ్రవణముల విడివి జడ మగు నీతో
శబ్దార్థము లెఱిఁగెడి ని,శ్శబ్దుని రామునిఁ గనుము శమమున మనసా.
స్పర్శలు గొను వేళలఁ ద్వ, క్స్పర్శలఁ బ్రకృతిగఁ దలంచి జడమగు నీతో
స్పర్శలు పతకముఁ గొనుని,స్పర్శుని రామునిఁ జూడు పాయక మనసా.
రూపములుచూచు వేళల, రూపములో వెలుఁగు రాము రూపము నీలోఁ
జూపని తద్రూపముఁ జి,ద్రూపముగాఁ జూడు ప్రకృతిఁ ద్రోయుచు మనసా.
రుచు లనుభవించు వేళల, రుచి జిహ్వలవిడిచి ప్రకృతిరూపగు నీతో
రుచులొను రామచంద్రుని, రుచిజిహ్వలనడుమఁ జూడు రుచిగొని మనసా.
గంధంబులు గొను వేళల, గంధఘ్రాణములప్రకృతిగాఁ గని నీతో
గంధము గొనియెడిరాముని, బంధురతేజుని భజింపు పాయక మనసా. ౩౧
పదపడి జితేంద్రియములను, బాదలెడి నినుఁగూడి విషయభోగంబుల నం
పద లనుభవించు రాముని, వెదకుము విషయేంద్రియముల విడువక మనసా.
స్త్రీవేషధారిపురుషుని, భావము చుమి తలఁప జీవభావము వేషా
భావమునఁ బురుషుఁ డగుగతి, జీవుఁడె రాముఁ డగు భ్రాంతిఁజిమ్మిన మనసా.
అల త్వంపదలక్ష్యార్థము, లలితం బగు తత్పదైకలక్ష్యార్థంబుం
దెలిసి యసిపదముతో ని,మ్ముల రామునిఁ జూచి పట్టు మొదలని మనసా.
సాకారము భ్రమయనియు ని,రాకారము శూన్యమనియు నవిశముఁ ద
ధ్యాకారము రామునిగా, నేకాలముఁ దలఁపు రెంటి నెఱుఁగుచు మనసా.
ఘనతనుకరణప్రాణము, లనువిన మెచ్చని ప్రకాశ మనువర్తించు
న్మనుకొని యాభద్రాద్రి,శుని నిఖిలేశ్వరునిఁ గాఁగఁ జూడుము మనసా.
ఇదిగా నిదిగా ననుచు,న్నొద లఖిలోపాఘులను సమున్నతిఁ ద్రోయం
దుదినెవ్వఁడు చెడకుండం, జెదరక యారామచంద్రుఁ జెందుము మనసా.
చ్ఛక నిహారలలోపలఁ, జ్ఞప్తి నిహాఁ దగయ మిగుల సరసుఁ డఖిలము
న్నైకైషువాఁ డారాముని. నిశ్చముగాఁ దెలిసి పొంది నెరయవె మనసా. ౩౮
వపురుషోత్తముఁ డఖిల,వ్యాపారముఁ జేయఁ బనుచు ననుదినమును ని
న్నాపరమాత్ముఁడె తగుసీ,తాపతి గాని నె తలంపు తలఁగక మనసా. ౩౯
పంచేంద్రియముల నినువియ, మించి మహాయోగులెయమేయ మహిము నీ
క్షించెద రట్టి నిరంజను, నంచితగతి నాశ్రయింపు మనిశము మనసా. ౪౦

ద్విదళకమలమునఁ జూపులు, పదిలముగా నిలిపి కోటిభానునిభుం డో
యదదేహుఁ బీతచేలు, న్నదమలభక్తిని భజింపు సతతము మనసా. ౮౧
చంద్రార్కకోటితేజు, న్సాంద్రామలమందహాసు సర్వేశ్వరు దే
హేంద్రియములకు విలక్షణు, నింద్రాదినుతు న్భజింపు మింపుగ మనసా. ౮౨
కలితాక్షరశబ్దస్వర, ముల నంటక వ్యంజనములఁ బొరయక బిందూ
జ్జ్వలనాదకళల మీఱిన, యంభద్రాచలనివాసు నరయుము మనసా. ౮౩
అక్షయమైన యకారా, ద్యక్షరముల మీఱి యక్షరాక్షరములతో
నక్షరమై లక్షణమై, సాక్షియు నగు రాముఁ దలఁపు సతతము మనసా. ౮౪
హృదయగుహాకాశాంతా, స్పదబిందూదర్పణమునఁ బ్రబలెడు కళలోఁ
బొదలెడి శ్రీభద్రాచల, సదనుని రాఘవునిఁ జూడు సతతము మనసా. ౮౫
హృదయకమలకర్ణికలోఁ, జను రని యోంకారనాదసంగతసీతా
హృదయారవిందభానుని, సదమలమతిఁ బొందు తుర్యసంగతి మనసా. ౮౬
జాగ్రత్స్వప్నసుషుప్తుల, విగ్రహములఁ బొంది యొసఁగు వెలిఁగించు మహా
దివ్యగ్రహుఁడెవఁడా సత్ప్రిణ, వాగ్రుని రామునిఁ దలంపు మనిశము మనసా.
నాశనముగ గుణరహితా, కాశపరాకాశములు తగం గని తత్త్వా
కాశమహాకాశాఖ్యా, కాశంబులలోన రాముఁ గనవే మనసా. ౮౮
మండితచంద్రార్కానల, మండలములలో నఖండమండలమై పిం
డాండాజాండంబులలో, నిండిన రాముని భజింపు నెరయఁగ మనసా. ౮౯
ఘోరాంజనకూటములో, శ్రీరామునిఁ జూచి యతని జెందుము విమలోం
కారస్వరూపుఁ డని యా, త్మారామస్వామి యని ముదంబున మనసా. ౯౦
అక్షరము లన్నియును రెం, డక్షరములుగాఁ గఁ జూచి యని మీఁదటి యే
కాక్షరమునఁ గూరిచి త, త్సాక్షిగ రామునిభజింపు సతతము మనసా. ౯౧
రూపములు మాయగాఁ గని, చూపుల లోఁ జూపుఁ జూచు చూపులు మఱియా
రూపులలో రూపును సీ, తాపతి నిజరూపుఁ జూడఁ దలఁపవె మనసా. ౯౨
తలఁపులు తలఁచెడివానిం, దలఁపులలో నుండు వానిఁ దలఁపుఁ దగులకం
దలఁగినవానిని నీలోఁ, దలపోయుము రాముఁ డని ముదంబున మనసా.
శబ్దోత్పత్తిస్థానము, శబ్దలయస్థలము వెదకి సమరసముగ నా
శబ్దములో శబ్దము ని, శ్శబ్దము నుచుఁ దలఁపు రామచంద్రుని మనసా. ౯౪

శబ్దము నంటక తగు ని,శ్శబ్దంబును గాక వానిసరస మరయుచున్
శబ్దాతీతుం డై ని,శ్శబ్దుండగు రాముఁ దలఁపు సతతము మనసా. ౫౫
బ్రహ్మాండములు మహేశ,బ్రహ్మాదులుఁ జనిన వెనుకఁ బరఁగెడు శబల
బ్రహ్మము నంటని రామ,బ్రహ్మము నెల్లపుడుఁ దలఁపు భక్తి న్మనసా. ౫౬
పిండాండ బ్రహ్మాండము, లుండినఁ బోయిన జనించుచున్నఁ జెడక తా
నిండారి సకలమునకు న,ఖండుం డగురామభద్రుఁ గనవే మనసా. ౫౭
కలచంద్రసూర్య తారా,నల విద్యుల్లోచనాది నవ తేజముల
న్వెలిఁగించుచు వెలుఁగుచులో, వెలిలోఁ గలరాముఁ బొంది వెలయుము మనసా.
ఆనంద మొందినపు డా, యానందముఁ బొందువాని నానందములో
నానంద మైనవానిం, బూనిక రాముఁ డని యతనిఁ బొందుము మనసా.
ఏకఘటాకాశమును మ,రాకాశముఁ జేర్చి యది మహాకాశములో
లేకుండఁ జేసి యదియె చి,దాకాశముగాఁగ రామునరయుము మనసా.
పూనిక విషయానందం, బానందము గాదు సుప్తి యానందం బ
త్యానందముగా దరసి త,దానందానందు రాము నరయుము మనసా. ౬౧
అరయంగాఁ దనువులకును, గరణములకు నీవు మిగులఁ గారణమగుటన్
మఱి నీవకారణంబే, దారి తెలియవు రాముగాఁగ దొరకొని మనసా. ౬౨
తొల్లిటి తనువులు విడిచియు, నల్లన నీతనువునంటి యంటక మీఁదం
జెల్లంగలపురుషుని నీ, యుల్లములో రాముఁగాఁగ నొగిఁగను మనసా. ౬౩
నిర్మలవృత్తిని సంచిత,కర్మము లటు ద్రోసి సమతకలిమి భవిష్య
త్కర్మము సేయక యిప్పటి, కర్మముఁ బెడఁబాసి రాముఁ గనవే మనసా.
జానజేయవిలక్షణు, నానావిధరూపకల్పనాతీతుం బ్ర
జ్ఞానస్వరూపు ఘను నీ, తానాయకుఁ బాయకెపుడుఁ దలఁపవె మనసా.
పలుకుల నంటక చూపులఁ, దలఁపుల నెడఁబాసి ప్రకృతి దాఁటి మనోబు
ద్ధులఁగడచి యంతయును దా, వెలిఁగించెడిరాముఁ బొంది వెలయుము మనసా.
మఱపు లెఱుక చేయుచుఁ దా, నెఱిఁగిన వెఱ్ఱెఱింగికొనుచు నెఱుకమఱపులన్
గఱు తెఱుఁగుచు నెమిటఁ దాఁ, బొరయని శ్రీరామచంద్రుఁ బొందుము మనసా.
తెలివికి వెత్తై సకలముఁ, దెలియుచుఁ దనుఁ దెలిసినట్టిధీరులఁ దనలోఁ
గలుపుకొనుచు నేమిటఁ దాఁ, గలియని భద్రాద్రివాసుఁ గనవే మనసా.

సాగసిన మురియక తిట్టిన, వగఁజెందక పాపపుణ్యవర్తనలను బాఁ
దగులక యేమియు నంటక, నెగడెడు శ్రీరామచంద్రుని గనుమనసా.
సాకారనిరాకారము, లేకాకారముగఁ జేసి యేకాలంబుక్
సాకారుండై తనర ని,రాకారుం డైన రాము నరయుము మనసా. ౭౦
చనరానిచోటునకుఁ జని, కనరానిపదార్థములను గనుఁగొని మైనం
గొనరానిసుఖముఁ గైకొని, మనరాదా రామచంద్రు మఱవక మనసా.
అఱుగనియన్నముఁ జకిగొని, యఱకంటను గన్నుమూసి యానందముతోఁ
దఱుఁగనిసుఖమున నెన్నం, డెఱుఁగని భద్రాద్రివాసు నెఱుఁగుము మనసా.
నెట్టన నెక్కుడ వెదకిన, బుట్టని వస్తువును జూచి భోగింపు మికం
బుట్టని చావని గతి యీ,పట్టున రాఘవుఁ డొసంగు బళి యని మనసా.
లేనిది లేనే లే దని, లేనిది యుండఁ గని కలది లే దని యేమిం
గానిది సర్వం బానని, యానని భద్రాద్రి రాము నరయుము మనసా. ౭౪
కలిమియు లేమియు లేకం, గలకాలము లేక కలిగి కలిగియు లేకం
గలకలిమి లేమిగాఁ గని, కలియుము శ్రీరామభద్రుఁ గనుఁగొని మనసా.
అంకలదప్పులఁ బొరయక, శోకము మోహంబు లేక సూడిద మై యే
లోకమున లేక వెలిఁగెడు, యాకాశాతీతు రాము నరయుము మనసా.
స్త్రీపురుషనపుంసకఘన, రూపంబులు గాక విశ్వరూపము తానై
లోపల వెలుపలఁ గలచి,ద్రూపుని రాఘవునిఁ గనుము రూఢిగ మనసా.
పల్లెలఁ బట్టణములఁ దం, జిలెడి కాఱడవులను విశేషగృహములం
దెల్లమిగ నొక్కగతి నిల,నిలెడి రాఘవునిఁ గనుము చెలువుగ మనసా. ౭౮
అలరు మనోవాక్కాయం,బుల నంటక జడములైన భూతేంద్రియముల్
వెలిఁగించుచు వానం దా, వెలుఁగని రాఘవునిఁ గలసి వెలయుము మనసా.
సకలంబు జడముగాఁ గని, సకలేంద్రియసాక్షి యై ప్రసన్నుం డై నా
యకుఁడైన భద్రగిరినా,యకు నెఱిఁగి భజింపు మఱవక సలము మనసా.
వటపిప్పలబీజంబుల, కుటజములుం.........
పుటములుగాను భద్రాచల,తటమందిరుఁడైనపరమధన్యుఁడు మనసా. ౮౧

అశ్వత్థము లీతనువులు, విశ్వములు నను స్థలోక విభులు జనములుర్
శాశ్వత మని తలఁపక స, ర్వేశ్వరుఁ డగురామభద్రు నెఱుఁగుము మనసా.
ఏరాముఁ బొంది మరలఁగ, రారు మహాత్ము లిల కానిరంజను నీలో
నారాధింపుము తగ సీ,తారామస్వామిగాఁగఁ దలఁపుచు మనసా.
ఛాయారూపము చూప్పన, నేయెడలను సాక్షి యగుచు నినుని పగిదిఁ దాఁ
బాయక విషయేంద్రియముల, డాయక వెలిఁగించు రాముఁడాయుము మనసా.
వెలుఁగుల కెల్ల వెలుంగై, వెలిఁగింపక వెలుఁగఁ బోక వెలుఁగుచుఁ దానే
వెలుఁగై యంతట వెలుఁగం, గలసీతారామభద్రుఁ గనుఁగొను మనసా.
గుణములఁ బొరయకను ఫిల, త్రుణుఁడై యపరోక్షుఁడై ప్రకాశించెడి యా
ప్రణవార్థగమ్యు నారా,యణు సీతారామచంద్రు నరయుము మనసా. ౮౬
శంకింపక పంకింపక, సంకల్ప వికల్పములను జరుగక తగ నే
వంకకుఁ బోవక విగత క,ళంకుని భద్రాద్రి విభుఁ దలంపుము మనసా. ౮౭
అజ్ఞానతమముఁ బొరయక, ప్రజ్ఞానజ్యోతి యగుచుఁ బరఁగెడు రాముర్
సుజ్ఞానముతో నీలోఁ, బ్రజ్ఞానముతోఁ దలంపు పాయక రామా. ౮౮
అమృత మమనస్క మవ్యయ, మమిత మనామయ మచింత్య మపరోక్ష మరూ
ప మమల మగమ్య తేజము, సమరస మగురాముఁ దలఁపు సతతము మనసా.
కారణ కార్యములకుఁ దాఁ, గారణమై కారణమును గడచి యవలి యోం
కారహాకారాంతరమునఁ, గేరెడు రాముని భజింపు కృతిగొని మనసా. ౯౦
నినుఁ గూడినందుకనయము, మునుకొన సంసారజలధి మునిఁచితి విఁకనిర్
దునిమెద భద్రాచలరా,మునిఁ గని విజ్ఞానఖడ్గమున నోమనసా. ౯౧
అజపాగాయత్రీమం,త్రజపంబున మించి మారుతముల నడఁచితిర్
భుజియించెదఁజూడుముమా,విజయరఘూద్వహునికరుణ వెలయఁగ మనసా.
ఎనసి యనిత్యము లగునీ, తనుకరణంబులను గూడి తాపత్రయతో
యనిధిం గూలితి విఁకనై, నను రాము పదాంబుజములు నమ్మవె మనసా.
నమమమకారాహంకా,రముల విడిచి రామచంద్రు రక్షకుఁగా ని
త్యముఁ దలఁచెద విఁకనీప్రే,మ్యము నాకే మనుసరింప నవయఁగ మనసా.
నీవలనఁ గదా నాకీ, జీవత్వము గలిగె నందుచే సంసారం
బావిర్భవించె విఁక నీ,తావిభుఁ గొలుతు న్భవద్వధార్థము మనసా. ౯౫
ఏమాఱక నిన్నేలిన, రాముని దలఁప నతఁడేమి రక్షింపఁడ......
.........ని, న్నేమని యిఁక నమ్మవచ్చు నిలలో మనసా. ౯౬

నీవనఁగ నెంత రాముని, సేవయొకించుకయు నాకు సిద్ధించినచో
భావనసె సంహరించెద, జీవత్వభ్రాంతి విడిచి సిద్ధము మనసా. ౯౭
దేహము ........,మోహము తత్సాక్షి యగుచు మొదలై తగులై
దేహప్రభుపైఁ గలిగిన, నాహం బ్రదుకుమవుగద రయంబున మనసా. ౯౮
నీకన్నఁ దక్షువగు నీ, ప్రాకటవివయేంద్రియముల పజ్జ మెలఁగుట
స్తోకవివేకమె తగదిఁకఁ, గాకుత్స్థాన్వయునిఁ గూడు గ్రక్కున మనసా. ౯౯
రాముని కరుణ నిజాత్మా, రాముఁడనై యుండెదను చిరంబుగ నిఁక నీ
వ్యామోహ మడిగి నాలో, నేమఱుఁ గలియుము నిరస్తప్రవృత్తిని మనసా.
భంగమును బొందకుండు కు,రంగమతంగజపతంగరాజీవమహా
భృంగములరీతిఁ గువిషయ,సంగతిఁ దలఁపు మిఁక రామచంద్రుని మనసా.

ఇది పరిషత్పుస్తకభాండాగారములోని
3438 సంఖ్యగల తాళపత్త్రప్రతికిఁ బుత్త్రిక:
మట్టివాడలో సంపాదింపఁబడినది.

# ౧౦. శ్రీగిరిమల్లేశశతకము.

## రామలింగార్యకవి.

### —సీసపద్యములు.—

శ్రీపార్వతీదివ్యచిత్తాబ్జసారంగ సారంగదానవక్షణనభీమ
భీమాట్టహాస విభేదితాంధకపుర పురపూర్వదేవ సంహారణబాణ
బాణగృహద్వారపాలనవిధిదక్ష దక్షముఖధ్వంస ధరనివాస
వాసవపూజిత వరపాదరాజీవ రాజీవపదహార రాజమిత్ర
మిత్రచంద్రాగ్నినేత్ర యమిత్ర విశర, శరధితూణీరనను బ్రోవు స్ఫారహార
రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౧

మాణిక్యఖచిత సన్మంజులకుండల కుండలిభూష సద్గుణసముద్ర
ముద్రితాశాపాశ మునిమనస్సంచార చారణగణనుత చరణకమల
కమలాక్షపూజిత కమలసన్నిభనేత్ర నేత్రీభవ ... ... ...
... ... ... ... ...
విభవములొసంగి నను బ్రోవు వేదవినుత, నుతజనాంభోజలోకబంధు ప్రకాశ
రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౨

... ... ...స సత్ర ఖండిత దితిపుత్ర పావనచారిత్ర పాండుగాత్ర
విలసదాశానేత్ర వేదసంచయపత్ర కార్ముకీకృతగోత్ర కర్మసూత్ర
వర్ధితమునిగోత్ర వాసవనుతిపాత్ర హార్యగ్నిశశినేత్ర యక్షమిత్ర
నారాయణకళత్ర నరకపాలసుపాత్ర మహితవియచ్ఛత్ర మారజైత్ర
కలుషవల్లీలవిత్ర భక్తాబ్జమిత్ర, పాలితచ్ఛాత్ర నను బ్రోవుపరమకృపను, రా॥

కైలాసగిరిగేహ ఖండితారిసమూహ పారదనిభదేహ భవ్యబాహ
పాటితగజదైత్య పరిశుద్ధశుభకృత్య మునిమనోజ్ఞాదిత్య వినుతసత్య
వందారుమంచార సుందరాహిపహార మందరాగవిహార మహితధీర
భద్రర్యాట్టంఖాణ పాథోధిపత్తూణ మురవైరిబాణ భాసురకృపాణ
నీకువందనమొనరింతు నీలకంఠ, విలసదాకల్పయశమిమ్ము వేగమాకు, రామ॥

శ్రీమహాలక్ష్మి సుస్థిర ఘనాంచితవేణి దర్పణగండ తామెతలిరుబోణి
పూర్ణేందువదన యే పొలతి పల్లవపాణి రదనాభిభూతసన్మృదుసుపాణి
కమలాభనేత్ర యే కాంతాశిరోమణి సంపత్సముద్ర యే సరసవాణి
అబ్జగర్భుని గన్నహరికి బట్టపురాణి దారిద్ర్యభేదనోద్ధతకృపాణి
యట్టిశ్రీదేవిమము బ్రోచునట్లు భవదు, దారస్వత్వపదమొసంగ వేధరనివేశ, రా॥

తారాహిమపటీరతారకతారేశశరదభ్రకాంతిని సరకుగొనక
కర్పూరపారదకామపాలామలనీరేజకాంతిని నెఱియుతెన్ని
మందారమౌక్తికకుందాహివాళీనకాశాభ్రసామజకాంతిఁ దెగడి
తనరుచు ప్రభలెల్ల ధాత్రిని విలసిల్లు భాసిల్లుభారతి భవ్యవాక్త్ర
వైభవమొసంగునట్లుగా భవదనుజ్ఞ, మొసఁగి రక్షింపవే మమ్ము భవనాథ, రామ॥

సర్వచరాచరజంతుజాలమునెల్ల సృష్టికర్త నటంచు సృష్టిచేసెఁ
ఫాలమ్మునఁ జేయు పాపపుణ్యంబుల ననుభవింపకతీర దంచు వ్రాసెఁ
దానె వ్రాసె నటన్న తగనిందరాకుండ విధిపూర్వకృతమను విధమొనర్చి
భాషాంగనాకుచపరిరంభదానందహృదయాబ్జుఁడైన యాసృష్టివిభుని
నెల్లవేళల సత్కృప నేలితయ్య, యట్టి నీకింక ననుఁ బ్రోవ నధికభరమె, రామ॥

సకలజగంబుల నన్యతృణాదిని సర్వకాలముఁ బ్రోచుసాహసంబు
వటపత్రశాయివై వనధిలో నిద్రించి యవ్యయపదమంది యలరుచుంట
భానుకోటిప్రభాభాసుర దేహుఁడై విలసిల్లుచుండెడి విమలయశము
రమ్యకౌస్తుభరత్న రాజితుఁడై లక్ష్మి పరిణయుండైనట్టి భాగ్యరేఖ
నీవరంబున గాదె యీయఖిలవిభవ, మబ్జనేత్రునికబ్బుటయుతనియందు, రామ॥

నీవరంబునఁగాదె దేవేంద్రునకు స్వర్గరాజ్యంబు గల్గుట రాజభూష
భవదనుగ్రహదృష్టి పాత్రుఁడై శేషాహి భోగవతీపురభోగమందె
నీకృపచేఁగాదె నెఱిఁగుబేరుండు దివ్య రాజరాజాభిఖ్యఁ దేజరిల్లెఁ
దావకకరుణాసుధారసపూరంబు నాపైనిఁ జిల్కించి నవ్యమహిమ
నేను విరచించుశతకంబునీకరాబ్జ, మందుఁ బూబంతికీతిగా నలరఁ దాల్పు, రా॥

దండధరోద్దండదర్పిష్ఠదైత్యారి గర్వాపహరణ విక్రమభుజుండు
కర్ణకుండల రత్నకాంతిచ్ఛటల్ గ్రమ్ము గండద్వయోన్నిద్రకాంతియుతుఁడు
భగునినేత్రము డుల్చి భారతివంచించి యగ్నిదేవుని జిహ్వలంటఁ గోసి
దశదిశాపతులను దారుణగదనొత్తి భాస్కరుపండ్లూడిపడఁగ మొత్తి
యజ్ఞభంగంబుగావించి యలరువీర, భద్రుఁగన్నట్టి శంకర భద్రవాహ
రామలింగార్యపోష వద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౧౦

హాలాహలమును జించి యారక్తమబ్జకరోటిని ద్రాగిన మేటి వీవు
బ్రహ్మమధ్యశిరంబు పటుతరగతిఁ ద్రుంచి మరలఁ దావేఁడిన మనిచినావు
దశకంఠుఁ డొకనాఁడు తారాచలంబెత్త, నంగుష్ఠమున దర్ప మడఁచినావు

హరియు మోహినిగాఁగ నతనితో రతికేళిఁ గలసి సత్పుత్రుని గాంచినావు
ఇట్టి నీలీలలెన్న నేనెంతవాఁడఁ, గరుణనన్నేలు సౌభాగ్యవరములొసఁగి, రా॥

శూరాదిదనుజప్రవీర బాధలకోడి బ్రహ్మాదిదేవతల్ ప్రస్తుతింప
దేవేశ భవదీయతేజం బొసంగిన వేమాఱు తెల్లులోఁ బ్రేమనుంచి
షట్పిండములుగాఁగ షట్కృత్తికలుఁ జూచి షడ్భావసహితలై సాఁకి రెలమిఁ
గాత్యాయనీదేవి కరుణతో షట్పిండములఁబట్ట నొకటియై ముఖమెలర్పఁ
బిల్లఁడై యొప్పి భవదాజ్ఞఁబృథ్విదనుజ, వంశములఁగూల్చె సేనాని వరదయాంక॥

అఖిలపురాణేతిహాసు వేదవ్యాసుఁ గవికుంజరాంకుశుఁ గాళిదాసు
దండిని భవభూతిఁ దగశంకరాహ్వయు మల్హణబిల్హణమాఘకవుల
భట్టబాణు మయూరు భారవి వాల్మీకి భవ్యపండితరాయుఁ బ్రౌఢకవిని
శ్రీనాథుభాస్కరు శివభద్రు నలసాని పెద్దనార్య విభూషుఁ బ్రీతిసోమ
యాజిముఖ్యుల నిర్మలానల్పయశులఁ, జేసిరక్షించితివిగదా సిరిచెలంగ, రా॥

నవరత్నఖచితమౌ నవ్యకిరీటంబుఁ బేదవాఁడును దలఁ బెట్టు టెట్లు
దనుజారిపంచుసుధాపూర్ణకుంభంబు నల్పమనుజున కదబ్బుటెట్లు
జలదంబులో మించు సౌదామినీరేఖఁ గని కౌఁగిటను జేర్పఁ గలుగు టెట్లు
పుట్టుభోగులఁ జూచి పొరిఁబొరిఁబొక్కెడి కష్టాత్ములకు సిరిగల్గుటెట్లు
గాన నీభక్తిలేనట్టి హీనమతికి, నెట్లుప్రాపించు నీసేవ యెన్నిచూడ, రామ॥

ఛందోనిబంధముల్చదివి చూడఁగ లేదు యతిగణప్రాస విఖ్యాతి లేదు
అమరకాండత్రయం బభ్యసింపఁగ లేదు నచ్చుహల్లుల భేదమరయ లేదు
కావ్యపంచకమైనఁ గడుఁ జూడఁగా లేదు కవిప్రసిద్ధార్థముల్గఱవ లేదు
శ్రీశంభుకృపచేతఁ జెప్పితిఁగాని నా శక్తిచేఁ గాదు నీశతకరచన
గానమత్కృతిసుకవు లహీనకరుణ, నెంచరెయ్యెడఁ జూచినఁబంచవదన, రా॥

వసుధఁ గొమట్రాజువంశాబ్ధిచంద్రుండు శంకరాభిఖ్యుండు సాంద్రయశుఁడు
సకలవేదాగమశాస్త్రము ల్పరికించి శైవరాట్ప్రభుఁడని తలఁచి మదిని
వీరశైవాచార విధి శివదీక్షచే లింగధారణ మయ్యె లీలఁ దనర
దశరథాత్మజుఁడంత దశకంఠుఁ దెగటార్చి శ్రీపర్వత ప్రదక్షిణముఁ జేసె
నాప్రదక్షిణగతి నతఁడధికభక్తిఁ, జేసె యుష్మదనుగ్రహశ్లిష్టుఁడగుచు, రా॥

ఆశంకరుఁడు బుచ్చమాంబను వరియించి కొమరుశేవుర నొకకూఁతుఁ బడసె
నందుఁ గనిష్ఠుండు నతిగుణాధ్యక్షుండు సౌందర్యపరిభూతశంబరారి

యహితాంబుదోద్ధతి కనిలమై విలసిల్లి నిఖిలమాత్రులలోన నిగ్గుదేలి
దానకర్ణుం డన ధాత్రిలోఁ బొగ డొంది, నాగయలింగంబు నయముమహిమను
జక్కమాంబను వరియించి శుభకరముగఁ, గొమరులను ముమ్ము నేర్పురఁ గోరికనియె॥
అందగ్రజుండును నతిగుణాఢ్యుండు వెంకయ్యార్యుఁడు పేర వెలసె భువిని
నక్షయంబగు శివదీక్షఁ జెన్నొందుచు నక్షయలింగంబునలరె ధాత్రి
భక్తికి ముంగొంగు పసిఁడియై బసవయ్య భాసిల్లె సౌభాగ్యపటిమచేత
మంత్రమంత్రార్థముల్మహినుచ్చరించుచు లక్ష్మీశలింగంబు లలివహించె
నెన్న నల్వురకన్న నేఁ జిన్నవాఁడ, నన్నుఁ గృపతోడఁ బ్రోవు మాపన్నపోష॥
మద్గురుమూర్తియా మహిమనుద్భటారాధ్యవంశాబ్ధిచంద్రుండు వరగుణుండు
షట్చక్రసంధాని షట్కోశరిపుజేత షడ్భావరహితుండు షట్స్థలుండు
కల్మషం బనునంధకారంబునకు శుద్ధసుజ్ఞానదీపమై చూడఁబడును
బరవాదులకు నెల్ల భయదప్రతాపుఁడై వీరభద్రాఖ్యచే వెలసె ధాత్రి
నట్టి మద్గురుస్వామి నే ననుదినంబు, సంస్తవమొనర్తు దుర్వర్ణశైలవాస,రా॥
ఖండితంబుగఁ గాలకంఠుఁడే కర్తంచు దండిబౌద్ధులవాద నుండఁ జేసి
యిల వేదపద్ధతి నీశుఁడే కర్తంచుఁ బాంచరాత్రుల చర్చపడటఁ గలిపి
లోకత్రయాచార్య పాకత విలసిల్లి పండితారాధ్యుండు భవ్యమహిమ
వాదించి పావకు వస్త్రాన బంధించి వరులింక లేకుండ వరలఁ జేసె
నేత్రములు దీసి స్ఫురదూర్ధ్వనేత్రయుగము, వడసె నేమేని నుతియింతుఁ బండితార్య
రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౨౦
అక్షయోజ్జ్వలభక్తి పాత్రికబసవని యక్షరంబులె కల్పవృక్షవితతి
యక్షరబసవనామాక్షరంబులు దల్చి పక్షివాహుఁడు లక్ష్మిఁ బరిణయించె
రక్షకాఖ్యబసవు నీక్షించుచున్నట్టి యక్షులు లోకాభిరక్షణములు
అక్షీణశివపదాధ్యక్షమహామోక్షాధిపాక్షరనిరతి మోక్షాస్పదంబు
గానబసవని నుతియింపఁగలరె పద్మజాచ్యుతాదిదేవతలౌరయవనిలోన,రా॥
బసవ నీనామంబు పాటించి విన్నను బశుచ్రులకైనను బరఁగుభక్తి
బసవ నీకథలెల్లఁ బాటించి నుడివినఁ బసిబాలురకునైన నెసఁగుభక్తి
బసవ నీనామంబు పాటించి వ్రాసినఁ బతితులకైనను భక్తిగలుగు
బసవ నీపదములఁ బ్రస్తుతిచేసినఁ బామరులకైనను భక్తిగలుగు
బసవబసవాయటన్నను బాపహరము, అట్టిబసవేశ్వరస్వామి నభినుతింతు,రా॥

భక్తమండలి కెల్ల భద్రగజోపము నుడివాలుమాచయ్య మహిమఁదలఁతుఁ
బరవాదులను జిహ్వవట్టి కోసినదిట్ట హూదిరాజయ్యను మదినిఁ గొల్తు
నంగుళంబులనొత్తి యమృతంబుఁజూపిన యొడపదయప్పన్న యడుగులెంతు
గురుభక్తివదలక గురుసతీహితబాధచాళితోఁ గైలాసమలరిచేరు
నట్టి బిల్లమరాజును ననుదినంబు, నాదుమదినిల్పినుతియింతు వేదతురగ, రా॥
కిన్నరబ్రహ్మయ్య కీర్తినుతించెదఁ గన్నడబ్రహ్మయ్య గణుతిచేసి
కల్లిదేవయగారి గాదిలిబంటను గక్కయ్యగారింటి కర్మకరుఁడఁ
జిటితొండభక్తుని జేరి కీర్తించెద వడయనంబికిఁ జేతు వందనములు
గొడగూచి నామదిఁ గొనియాడుచుండెద నక్కమహాదేవికనుఁగుశరణు
ముగ్ధసంగయ్యగారికిఁ బదములర్పఁ, బ్రణుతిచేతుననద్భక్తిపటిమచెలఁగ, రా॥
మోళిగమారయ్య ముసిడిచౌడయ్యయు శూలదబ్రహ్మయ్య సురియచౌడు
బడవలబ్రహ్మయ్య బాబిరాజయ్యయు శివనాగమయ్యయు శివకరుండు
అల్లయ్య మధుపయ్య బల్లేశు మల్లయ్య గోడలమల్లయ్య గోహిరుండు
నాదిగాఁ గలయట్టి యమితగణావళి నూతనప్రమథుల నూలుకొల్పి
శరణుశరణంచుఁ ద్వత్పాదజలజమాత్త, నిలిపివినుతింతునిత్యంబు నేర్పుమీఱ॥
పరఁగ ననంఖ్యాతప్రమథగణంబుల వర్ణించి లెక్కింప వశమె విధికి
భూతగణంబుల ముదముతో లెక్కింప నాదిశేషునకైన నగునె వశము
శుద్ధవైదికశైవసిద్ధాంతగణముల గణనకు శక్యంబు గాదు హరికి
రూఢప్రతాపసద్రుద్రగణంబులఁ బరికింపశక్యమే భారతికిని
నిట్టిగణసంఖ్య చేయఁగానిలను వశమె, పుండరీకాక్షబాణయంభోధితూణ, రా॥
పరఁగ శిలాదుఁ డన్వరమముసీంద్రుండు పుత్రసంతతిలేక పుడమిలోన
నావంతపాషాణ మాహారముగఁ జేసి నిన్నుఁగూర్చి తపంబునెఱయఁజేయ
నాఋషితపమున కానందమునఁ బొంగి ప్రత్యక్షమై నీవు ప్రోధిమెఱయ
మెచ్చితి నీతపంబిచ్చెద వరమన్న నిద్దఱుతనయుల నీయు మనిన
నట్ల యగుఁగాకయని పోవనంతలోనఁ, గొమరులిద్దఱుగలిగిరి కోర్కెదీర, రా॥
అందుజ్యేష్ఠుండగు నందీశ్వరుండును, మహానంది యనుపురి మహిమమించె
బరఁగ రెండవవాఁడు పర్వతాభిఖ్యుఁడు, నజ్జారిధరభవదంఘ్రియుగము
భజియించి మెప్పించి భర్గమహాదేవ నిజబంధుయుతముగా నీవు నాదు
శిరమున నిలుమన్న సిద్ధభక్తాళితోఁ బ్రమథబృందముతోడఁ బ్రమదమునను
వచ్చి నిల్చితి వయ్య నిర్వాణఫలద, పార్వతీనాథపాలితభక్తయూథ, రామ॥

నిజకాంతినిర్జితనీలమేఘంబయ్యుఁ బృథ్వీపీఠంబుచేఁ బృథులమయ్యు
నంబరంబే తన కధిక లింగముగాఁగ దశదిశ ల్వస్త్రసంతతి యుఁగాఁగ
నక్షత్రములుమూర్ధనవసుమాళినింప సూర్యచంద్రులునేత్రశోభఁజెలఁగ
గుహలునాసారంధ్రఖ్యాతిగన్పడఁజేయ వృక్షము ల్తనురుహావృత్తిఁదెలుప
నట్టిరూపంబుతో భువినధికగతిని,నున్న శ్రీ గిరిమహిమ నేనెన్నఁగలనె, రామ॥
ఒకచాయస్వర్ణరుచోజ్జ్వలశిఖరంబు లొకవంక మాణిక్యనికరములును
నొకక్రేవ రజతమై యొప్పారుచుండును నొకదిక్కు తామ్రమై యొప్పుచుండు
వజ్రనిర్మితసౌధవాటిక లొకచోట మరకతసానుల మహిమలొకట
నొకయుక్తప్రాకార మొకవంక గోపుర మొకదండ నాలయమొప్పు దనర
మించు శ్రీ గిరి మహిమ నేనెంచఁగలనె,గానఁ దోఁచిన మట్టుకుగణుతి సేతు
రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిమల్లేశ శాంకరీశ. 30
మల్లికాకుండ సన్మహిమ యెంతనిచెప్ప భూతికుండోజ్జ్వలపుణ్యమెంత
వాగ్దేవికుండంబు వర్ణింపఁ దరమానె బ్రహ్మతీర్థము నెట్లు ప్రస్తుతింతు
రుద్రాఖ్యకుండంబు రూఢి యెంతని యెంతుఁ బంచధారలమహిమెంచవశమె
కోలాఖ్యకుండంబుఁ గొనియాడఁదరమౌనె శంఖకుండోజ్జ్వలసారమెంత
దివ్యతీర్థాన్వితంబైనభవ్యపర్వ,తప్రభావమెంచంగనాతరమెయీశ, రామ॥
సర్వమంగళ నీకు సామేన నొప్పఁగా నంది ముఖుల్ రుద్రులున్నుతు లొనర్పఁ
పద్మగర్భుఁడు నిత్యపంచాంగమును జెప్ప జలజనేత్రుఁడు పరాకులను దెల్ప
తుంబురునారదుల్ దంబుఱల్మీటంగ గంధర్వభామినీగాన మమర
గీర్వాణకోటీరకీలితమణినీలబంభరవ్యాపితపదసరోజ
యుగళశంకరనిన్నునిజోత్తమాంగ,నిలయుఁజేసినపర్వతునేభజింతు, రామ॥
శ్రీమల్లికార్జును సేవింతు నెప్పుడు భ్రామరి నేప్రొద్దుఁ బ్రస్తుతింతు
శిఖరేశ్వరుని నాత్మ సేవింతు సేవింతు గణపతిదేవుని గణుతిసేతు
వృద్ధమల్లన్నను సిద్ధంబు పూజింతు బిందుతీర్థము మదిఁ గొందు నెపుడు
హాటకేశ్వరు నింక నాత్మలోఁ దలపోతు సారంగధరుని నే సన్నుతింతుఁ
బరఁగ శ్రీశైలపట్టణవాసులైన, పారికాంక్షిగణంబును బ్రణుతిసేతు, రామ॥
చెలఁగి శ్రీగిరి నుతిచేయలేక మురారి సితవార్ధిలో శయ్య చేసెఁగాదె
పర్వతమహిమెంచఁ బాటిల్లకనుగదా భువిపూజలేకను బోగిలె విధియు
శ్రీగిరి మహిమను జెప్పలేకయకదా శతధృతి జారుఁడై ధృతినివిడుట

కడు శ్రీగిరిమహిమ గణుతింపలేకను శేషాహి పాతాళసీమనంటె
నిట్టివారికిఁ దెలియనిగట్టు గుట్టు, పట్టి వర్ణింప వశమావె ప్రాకృతులకు, రా॥

శ్రీపర్వతము మోవఁ జాల్నైతేఁకి భారమై తలల్వంచెను భీతుఁడగుచుఁ
బర్వతమ్మును మోయు భారమై భూకాంత మృత్తురూపము దాల్చె నృపులమొదలి
పర్వతేంద్రుని మోవ భారమై కమఠంబు పెంపు చెక్కలుగట్టి బిసుగుచుండెఁ
బర్వతేంద్రుని మోవ భారమై దిక్కరులు లాచంచకోద్ధతి నంటియుండె
నెంత భారంబొ తలిదండ్రులెట్లుగనిరొ, మోచఁద్వశ్రృపచేఁగా దెయిట్టిబలము॥

ఈపర్వతముసాటి యిల మేరు వెట్టగు బిల్లని వంచిన నెట్టియుండ
నీపర్వతముసాటి యిలఁగ్రౌంచ మెట్లగుఁ గాంచంబుగుహలు చేఁజించఁబడిమె
నీపర్వతముసాటి యిలవింధ్యాద్రియే వింధ్యాద్రి ఘటజుచే వినతమయ్యె
నీపర్వతముసాటి యిల మందరాద్రియే వైశాఖమై వార్ధి వరవఁబడిమె
నేమి పర్వతసాదృశ్య మీనగానికి, గానరాదింక నేనెట్లుగణుతిసేతు, రామ॥

శ్రీపర్వతంబని చింతించినతఁ మునిఁ గామధేనువ నింటికాఁపుగాదె
శ్రీపర్వతమునిజూడఁ జెలఁగడు గిమరంతఁ బాపమంతయు విచ్చి పాఱిపోదె
శ్రీపర్వతేశ్వరశిఖరంబుఁ జూచిన విగత జన్మండయి వెలయు ధాత్రిఁ
బర్వతేశ్వరచిహ్నంబఁ బాకించి శరణన్నఁ బ్రహ్మధన్యులుగారె భాసురముగ
నట్టిపర్వతవరుఁడు నన్నధికకృపను, నైర్ధనోపేతుఁ జేయును వసుధలోన॥

ఆదికాలమునాఁడు హరుఁడు కొలువుశుదీర్చి యుండంగ నంబిక యుబ్బుమనివి
హరుఁడెఱుఁగక యుండ హరునేత్రములుమూయు నానందజలములు నపుడు గ్రమ్మెఁ
బది ప్రేళ్లవెంబడిఁ బదిబిందువులు రాలఁ బదివిధంబులనదు లవరఁగఁ బుట్టె
హరి విధి వజ్రియుహరుని బ్రార్థింపంగ మూఁడులోకములందు మూఁడునదుల
నుండవరమిచ్చె నీశ్వరుం డొప్పమిగుల, నట్టివిధ మెన్నఁజాలరీయవనిలోన॥

విష్ణుపద మనంతవిఖ్యాతిఁ గాంచెను వ్యోమకేశుఁడుగాఁడె సోముఁడరయ
నామహాదేవోత్తమాంగసంభవగంగ విష్ణుపదోద్భవవిఖ్యాతిఁ జెందెఁ
బామరులాపదపథయని తెలియక హరిపదసంభవ యనితలంతు
రీయర్థ మిట్లుండు నిదిగాన రెవ్వరు భ్రష్టులై నరకకూపంబులోన
మగ్నులగుచును దేజోవిభగ్నులగుచుఁ, జెడిరి ప్రజ్ఞావిహీనతజీర్ణయశులు, రా॥

తనచేయుధర్మంబు తనపాలి ధర్మమై కాచిరక్షించును గరుణతోడ
సత్యంబు కైవల్యసత్రమబ్బఁగఁ జేయు శాంతమే భూషణచయము తనకుఁ

బరహితంబె శత్రుపటిమకు వాక్పటు వరఁగ జ్ఞానము పాపవార్ధికట్టు
కరుణారసంబె పో కామితఫలదాయి ముచు సదాచారంబె ముక్తిత్రోవ
నిరుపమానందవైరాగ్యనిధికి సౌఖ్య,మబ్బుఁగా కష్టలకుఁగల్గు టనియుఁగల్గ
రామలింగార్యసోమ సద్రాజధామ, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౮౦
విమలగుణంబులే శోభ్యాతి జగతిలో నింపుయశం బిమ్ము నీతిపథము
పూర్ణవిద్యలు రాజపూజ్యుని గావించు గురుభక్తి విజ్ఞానగుణము నిచ్చు
సజ్జనసంగతి సన్మాన్యుఁ గావించుఁ గరుణగల్గుట ధర్మకారణంబు
సరసవాక్యంబులు సకియుల వలపించు సజ్జస్తినిద్రయే హానిదెచ్చు
పరసులగువారు సత్పథసరణిఁదెలిపి, భువినివర్తింతు రార్యాభిపూజ్యులగుచు॥
సకలసద్గుణధైర్యసంపన్నవరునకు సకలసురాచారసతినిగూర్చు
సౌందర్యవిభవలక్షణశాలి నాతికిఁ గపుఁ గురూపిని భర్తగా నొసర్చు
నిఖిలధర్మజ్ఞాన నిర్ణయోదారుని ధనహీనుఁగాఁజేసి త్యాగియనఁచు
ధర్మశూన్యతనొంది తగుదుష్టునకుఁ జాల ధనము గల్గఁగఁజేసి ఘనునిఁజేయుఁ
గమలగర్భుఁడు నీవిధి కరుణమాలి, జరుపుచున్నాఁడు నీకృపగనుపవలయు॥
ఐశ్వర్యపరునకు ననుకూలపతిరాదు పడిగల్గఁ దనయులు నబ్బరందు
సతిసుతుల్గలిగిన నతిదరిద్రుం డౌను ధనవంతుఁడైనను దగులు వ్యాధి
రోగహీనుండైనఁ ద్రాగగంజియులేదు గం జున్న సుగుణంబు గుంజిపోను
సుగుణంబు గల్గినఁ జూడ నాయువులేదు నాయువుగల్గిన నతఁడు దన దగు
గాన విధి యిట్లు కల్పించెఁగరుణమాలి, కాచిరక్షింపభవదీయకరుణగాదె॥
తనయులపై కూర్మి తల్లిదండ్రులపైని గల్గనేర దదేమి కారణంబు
ఆలిపైఁ దనకున్న యనురక్తి కొంచెమైన నతిధిగణంబుపై నలర దేమి
విత్తార్జనంబుపై వెలసినతనపేక్ష ధర్మమార్గమునందుఁ దగులదేమి
తనవారిపైనున్న దాక్షిణ్యభావంబు భువి జీవకోటిపైఁ బొలయుదేమి
తివిరిజీవులు నింద్రియాధీనులయ్యుఁ, దావకీయాంఘ్రిపద్మము దలఁపరేమి॥
అతిలోభులను భిక్ష మడుగఁ బోవఁగరాదు నన్యాయవిత్తంబు నంటరాదు
చనువుమాలినవానిఁ జంకనెత్తుకొరాదు చెడి యున్నవారింటఁ జేరరాదు
తనదుసొమ్మొకరింట దాఁపఁబెట్టఁగరాదు తనకీర్తి తనుదానె తలఁపరాదు
వలవని సతిఁజూచి వలచి నవ్వఁగరాదు పిలువని పనులను మెలఁగరాదు
చెడుదురీగతినడచెడుపుడమిజనులు, అమృతగుణరంగధవ్యజటాస్థగంగ, రా॥

గుణమెఱుంగనిరాజుఁ గొల్వఁబోవఁగరాదు గుఱుతెఱుంగనిచెలిఁ గూడరాదు
కలఁత జరుగుచోటఁ గడునిల్వఁగారాదు నలఁతవేళల పతి నంటరాదు
కలుద్రావువానితోఁ గలహింపఁగారాదు పలుమాఱు బొంకులు పల్కరాదు
పఠ్వంగశాస్త్రంబు సల్పుచుండఁగరాదు కోమటిసాక్షిగాఁ గోరరాదు
సరసమైనట్టి సత్పథసరణిదెలిసి, నడచిరేనియు భాగ్యము ల్పడయుటరుదె॥
విత్తహీనుల కూఁగుత్తకుఁ బోరాదు పొత్తులకృషికిని హత్తరాదు
అండగన్పడ నూరనుండఁగోరఁగరాదు హేతు విరోధిని జేయ హితముగాదు
సర్పంబుతోఁ జెల్మి సల్పుచుండఁగరాదు కొండెచోరులచెంత నుండరాదు
అడుగ నిచ్చెడువేళ నాశకుఁ బోరాదు నల్పునితో హాస్య మాడరాదు
హర భవత్పదాంభోజము లాశ్రయించి, ముక్తిగనలేకమూర్ఖతమునుఁగరాదు॥
భూమి నాదని సర్వభూపతు ల్పలుకంగ ధరణీపతులఁ జూచి ధాత్రి నవ్వుఁ
దండ్రి పుత్రుని నెత్తి తగ ముద్దులాడఁగా జారకామిని నవ్వు సరసగరిమ
ధనవంతుఁడయ్యును ధర్మశూన్యతనొందు నరునివర్తనఁ జూచి నవ్వుధనము
వెన్నిచ్చిరణములో వెనఁబాఱు బంటునుజూచి మృత్యువు నవ్వుఁజోద్యముగను
దుష్టవర్తన నడిచెడిధూర్తుఁ జూచి, దండి యేప్రొద్దుఁదలయూఁచి తనరనవ్వు॥
వక్కలాకులు మెక్క నక్కపోతున కేల చక్కనివనితకు జడత యేల
యంధున కందంబు నదియేల చూడఁగాఁ జెవిటికి గానంబు చెల్వదేల
మూర్ఖున కేటికి ముక్తిపదంబులు ధర్మశూన్యుల కేల దానగుణము
కఠినచిత్తున కేల కారుణ్యరసములు కులట పత్యాజ్ఞలఁ గుదురుటెట్లు
పరమఋషులకు సంసారభారమేల, భక్తి మిముఁగొల్చువారికి భయము దేల॥
పాముకూనకుఁ బాలు పరఁగంగఁ బోసిన విషగుణం బెడలునే వీసమైన
వేఁపచెట్టుకుఁ దేనె వేయేండ్లుపోసిన విఱుగునే తనచేఁదు వీసమైన
బుద్ధిహీనుని కెంత బోధగావించిన విజ్ఞానివిధముగా వినుటయెట్లు
జారను బతి యెంత చక్కఁగా బోధింప తనవృత్తి విడుచునే ధాత్రియందుఁ
గానభగవంతునినెఱఁగ ల్చికరుణఁబడయు, జీవి యమమందిరంబునఁ జేరుటెట్లు
రామలింగార్యపోష సద్రాజభూష శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౯౦
కలిమి సంపూర్ణమాకొలఁది ధర్మము లేని కలిమి గాదది పెద్ద కొలిమి గాని
పత్యాజ్ఞ మీఱుచుఁ బ్రల్లదంబాడిన నాలుగాదది యెఱ్ఱతేలుగాని
సర్వజనవిరోధసత్పట్టణంబేని వీడుగాదది వల్లకాడుగాని
స్ఫురదళీకాలాపశోభఁ జెలంగెడి వాయిగాదది పాడునూయిగాని

నీకృప కపాత్రుఁడై ధాత్రి నెఱయునరుఁడు
నరుఁడుగాఁ డెన్నిచూడ వానరుఁడుగాని
రామలింగార్యపోష సద్రాజభూష
శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౫౧

పృథివి ముండ్లకు వాఁడి పెట్టిన దెవ్వఁడు పాముపండ్లకు విషంబు వరపె నెవఁడు
ధరణిపై సెలయేళ్లు త్రవ్వించి రెవ్వరు తేజంబులకు వేఁడి దెచ్చి రెవరు
కస వెవ్వ రుర్విపైఁ గల్పించినారు లేఁకఁ గనకంబునకుఁ జాయ గలిగె నెట్లు
నవనీతమతిమృదూన్నతిఁ జేసి రెవ్వరు సద్రికిఁ గారిన్య మలరు టేమి
సహజసిద్ధగుణంబులు సరసమగుచు, గాన కల్పింప నెల్చనే కాలమెల్ల, రా॥
సకలధర్మజ్ఞులై సర్వజ్ఞమతులయ్యు వారధర్మంబులఁ దగిలియుంట
పరసతికూటమి పాటిగా దనియెన్ని పరధనాపేక్ష యెప్పటికి లేక
యనృతవాక్యంబుల నాడక విఖ్యాత నాఁకొన్నవారికి నన్న మిడుచు
దేవతాబ్రాహ్మణాత్మికదివ్యనిష్ఠయుఁ బుత్రసంతతిచేతఁ బొలుపుగనుట
సుగుణసంపత్తిసత్కీర్తిశోభగనుట, ప్రాగ్భవంబునమిముఁగొల్చుఫలముకాదె॥
సర్వశుభాకర సర్వమంగళ మేన రాగి సొమ్ములు పెట్ట రమ్య మగునె
తల్లి లేకుంకాక తల్లి పెంచినబిడ్డ పెంపేల చేయవు పేదతనము
మోహంబుచేఁ గన్న మోహసుతునకుఁ గట్ట బట్టీయవు కటికితనము
సకలసౌభాగ్యము ల్భవజహాళి కీయవు జవనాము మెఱ్వఁగఁ బరఁగు నీకు
నైన వారలభాగ్య మేసంఁయఁగలనె, వేఁడనన్యంబుమోక్షంబె వేఁడు వాఁడ॥
గజతురగాందోళికలునెవ్వచుండఁగ గోరాజవాహ మేకొఱ్ఱ చెపుమ
నవరత్నకాంచన నవ్యభూషలుండ నురగభూషణు లేమి నుంచుటేమి
దివ్యదుకూలము ల్తేజరిల్లుచునుండ గజచర్మధారివి గాఁగ నేమి
యిష్టపదార్థసంతుష్టి గల్గినని ల్భిక్షాటనము సేయఁ బ్రతియేమి
లోభరీతిని భాగ్యంబులో టుపడిచి, యున్న నిన్నన్నఁగలనె యాపన్నరక్ష॥
పరభామ ముట్టనుపాయంబు గల్గదే లోకాపవాదము లోఁగుఁగాక
బలహీను నధికుండు పరిభవింపఁగరాదె నిందింతురను భీతి నిలుచుఁగాక
యధికారి తా స్వార్థ మపహరింపఁగరాదె యది భంగపడఁ దక్కదనుటగాక
దొరలతో వైరంబు తొడఁగింపఁగారాదె ప్రాణహానికి భయపడుట గాక
యవని దుర్మార్గవృత్తికి హానిగలదు, హాని లేకను వర్ధిల్లు నమలయశము, రామ॥

కాలికిఁ జెప్పట్టజో లెఱుంగనివారు పల్లకీ లెక్కెడి ప్రౌఢిగనిరి
కట్టుగుడ్డయు లేక కడుఁ గృశించినవారు దివ్యాంబరప్రాప్తిఁ దేజరిలిరి
కుండకూ డెప్పుడుఁ గనకయుండెడివారు బిందె తప్పేలల పెంపుగనిరి
తమిదంబలియు లేక తపసొనర్చెడివారు పరిపఁటకంబుల బలుపుగనిరి
బందిపోట్లను ఖైమునఁ బడ్డవారు, పెద్దలై వారు నేఁటికిఁ జేసుకనిరి, రామ॥
పదుగురు మెచ్చుచు బహుమతిచ్చునపుడు పెళ్లఁ జనఁగొట్టువాఁడె పో బడవకొడుకు
సభలోనఁ గొప్పగాఁ డించు చనుపుఁ జెండెడు వేళఁ జుప్పలెన్నెడివాఁడె ధగిడికొడుకు
ఒకరీయఁగాఁ జూచి యొప్ప దనువాఁడె పో అడుకుయుండకుఁ బుట్ట రట్టడీఁడు
వడిఁ బీటపై పెద్ద పడఁద్రోయునంతలోఁ బెక్కఁబొంగువాఁడె పో మోటభడవ
ఫలముఁ బూనంబుఁ జేసెడివాఁ డుండ, లెన్నటికి నిమ్ముఁ జేర రెండెంచిచూడ, రామ॥
చిక్కినవస్త్రంబుఁ జింపఁ జూచుచు గాకి పలిసిన పసిపైని బాఱదెపుడు
పీకుఁగు డొక్కలు పెల్లగించెడివక్త జీవంచు ప్రాణిపైఁ జేరఁబోదు
తెలిపేడు నుసిపుర్వు తొలి యొనర్చునుగాని చెఱుపలే దెన్నిటఁ జేవకట్టి
యీఁగ తాఁ బుంటిపై సీపిఁ బెట్టునుగాని మెఱుఁగైన మేనిపై మెలఁగ లేదు
దీనజనులను దుష్ప్రభు తిట్టుఁగాని, చొక్కి బలవంతుఁ గన్నెత్తిచూడ లేఁడు॥
గోవులఁ బసుఁగొట్టి కోసి మాంసము తిను మాలలు మేదినీపాలు రైరి
వీథిలోఁ జాడులు వెదుకు తోఁ పెద్దఁ గ్రాంతలంజెలు వీరమాత లైరి
యూకారి ప్రుష్టేని సతిహీనమనుజులు పండితాధికులయ్యెఁ బ్రబలి రిలను
సద్వంశజులు లెఱ్ఱ పరధన ధన్యులై రాజసన్మానులై రహిఁ జెలంగి
రిల్లు ముష్టాల ములమెన సంచు లాఘన్యులు కులంబు మూలకు నొత్తిగిల్లె
రాముల నిగుల్యాపాకు ననద్రాజసుఖము, తనుఁ శ్రీగిరిమలేశ శంకరేశ. ౬౦
చిన్నవాఁ డైనప్పుడుఁ జెలరేఁగి యొడ్చుట వర్షంబు వర్షించు భవన మొకట
ఇంట లేకయు ధూమముహూలిమా నగ్నియు సలులు గుట్టెడు సర్వశయ్య
సను బాయి కూడును ఘనపంకిలోపలసరణియు తొంరంపుజలము మఱియు
మానవ సహ్యమా మాసినబట్టయు దీప్తి హీనం బైన దీపకళిక
మాటవినసట్టి పెండ్లము మఱియు నిట్టి, పదివిధంబులు దుఃఖసంపాదకములు॥
పట్టుపు దేశకి ఒట్టలేక కృశింప బానిస కబ్బునే పట్టుచీర
పండ మంచము లేక ప్రభువు దుఃఖింపఁగా బఱు పబ్బ నేర్చునే బంటునకును
జప్పిఁడియఁజలి నపడు దినములఁ బిండివంటలపైని బ్రీతి దగునె

కుంభకోలయుఁ బట్టి కోరాడుదినములఁ బల్లకి యెక్కెడి భ్రాంతితగునె
కాలవిపరీతమున భోగకాంక్ష విడువఁ, జాలకున్నను నగుదురుజగతియందు॥
ఘృక్షస రత్నమండవరాజి యేటికె దర్పణమేల జాత్యంధునకును
విరజాజి పూవఁడ విధవాంగనకు నేల కుమతికిఁ బుణ్యసద్గోష్ఠి యేల
మూఢున కేటికి ముక్తివాక్యంబులు కోపికి సౌజన్యగుణ మదేల
స్వైరిని నత్రేల ముక్కిఁడిదాసికి సౌందర్యవతి యేల షండునకును
జారకేలను సద్వృత్తిసార మహిమ, కరివిభుకేల ప్రజలదుఃఖములజోలి॥
గోవధాన్వితవిప్రగోరోచనంబు రోగార్తున కొసఁగ మోక్షాప్తి గలదె
ఫలయుక్తపాదపంబులు త్రెంచి తత్ఫల వితతి విపుల కీయఁ జతురుఁ డగునె
చెఱువులుఖండించి చేలు గావించియుఁ జలివేంద్రలుంచియు సరసుఁడగునె
బలవంతమున నన్యభామలఁ గనలించి దంపతిపూజ గావింపఁ దగునె
యనృతములనోట నెప్పుడు నాడుకొంచు, నతిథిఁబోషింపఁగల్గునేయధిక ఫలము॥
సారమేయము లొక్కసారిగా మొఱఁగిన భయపడి తిరుగునే భద్రగజము
జంబుకంబుల వ్రేక్కసమయమందు మొఱుంగఁ బెడబొబ్బలిడునొకో పెద్దమెకము
డేగలు నిజబలోద్వేగంబుఁ జూపిన సంచరింపక యున్నె సాళువంబు
సింహంబు లొక్కటై చెలరేఁగి ధ్వనిచేయ సాధ్వసంబందునే శరభమృగము
భువిని నీచ నల్పులు ఘోరబలులని, బరిభవించినఁ దగ్గునే ప్రాభవంబు, రామ॥
జానునిభావంబు జారకుఁ దెలియును పాముల జాడలు పాము కెఱుక
తస్కరప్రౌఢిమ తస్కరుండెఱుఁగును నీరు పల్లంబైన నేల నెఱుఁగు
హింసాపరునివృత్తి హింసాపరుఁడెఱుంగుఁ బిశునగుణంబులు పిశునుఁడెఱుఁగుఁ
గడుఁ బతివ్రతబుద్ధి ఘనపతివ్రతగను మానిమానసవృత్తి మానియెఱుఁగు
సజ్జనుఁడెఱుంగు సజ్జనస్వాంతమహిమ, నిరుపమానందవైరాగినిన్నెఱుంగు॥
పైకంబు గూసినఁ గాకంబు గూయదె దంతివచ్చిన త్రోవ దుంతరాదె
మామిడిపూచిన మంకెన పూయదె తురగమేగిన దారి ఖరముపోదె
సింహముల్ ధ్వనిచేయ శివములు గూయవె దొరలువచ్చినత్రోవ దొంగ రాఁడె
నరులుండుగతిని వానరములు నుండవె ఘనవ్యంతమురాదె ఘర్మమట్ల
సుజనుగతి దుర్జనుం డంతశోభ నున్న, నెచ్చుతగ్గులు గల్గవే యెన్నిచూడ॥
ప్రాప్తించునొకవేళఁ బాకశాసనుకైన దైన్యయాచ్ఞావృత్తి దారుణముగ
నొకవేళ యమునకు నోడఁగూడు దుర్వారరణరంగమందుఁ బరాభవంబు

ప్రాపించు నొకవేళ భాగ్యవంతులికైన భయదదారిద్ర్యసంబాధకంబు
రాఁగిల్లుఁ బండితరాయుని కొకవేళ ధాత్రీశసభలలోఁ దప్పుమాట
గర్వపడియుంట భువిలోనఁ గాని మాట, యెట్టివారికినొకవేళ నెగ్గుగలుగు॥
పటుసౌఖ్యవిభవసంపత్తియు లేక యే హీనంబు ప్రాప్తించు మానవునకు
నిరుపేర కెయ్యెడ నిష్టంబు లేక యే జగడంబు సమకూరు జగతియందు
ఘనకర్కశులనైనఁ గడుసమాధానంబు చేసి కార్యము బాగుచేయు రాక
దొరకెన్న చాలదు తోరంపుమూఁకనే మానంబు కోకనే మగువలకును
నోర్వ లేక యే మనుజులీయుర్వియందుఁ, బరులమర్మంబులెన్నుటప్రౌఢగరిమ॥
గళలగ్న దివ్యముక్తాసరంబులు త్రెంచు క్రోఁతి కాలందెలు గొలుసుకున్న
తస్కరుం డిలుసొచ్చి ధనమెల్లఁగైకొని కంచంబు విడుచునే కరుణదలఁచి
వంటింటిలోనికి వడిఁ జొచ్చి శునకంబు కుడుకుండ ముట్టక మరలిచనునె
చలువబట్టలె చాకి తొలఁగనం బొనరించి మాలిన్య వసనము ల్కట్టుకున్నె
ఘాత కొడిగట్టుమనుజుండు కఠినబుద్ధి, సాధుబాధ యొనర్పఁడే క్ష్మాతలమున
రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౨౦
కడుహీనగతి వారకాంత గణింపదే కుణపంబునకు వాహకులును లేరె
క్రోఁతి వెంబడి జనకోటి చరింపదే దండధరుం డెన్నుదండ రాఁడె
ఘనవాద్యఘోషము ల్గంగిరెద్దుకు లేవె మాలఁడు భోజనము హాయిగనఁడె
రాతిబొమ్మకు లేదె రత్నభూషణరాజి పోతుకు వెడఁదయౌ పొట్ట లేదె
దుర్నయుండైన ప్రభువుకుద్యోగమహిమ, నెంతవిభవంబు గలిగిన నంతె ఫలము॥
మునుపున్న మాన్యము ల్మాంపకుండినఁజాలుఁ గ్రొత్తవృత్తులు సమకూర్చినట్లు
మునుపున్న పడితరంబులు ముంచకుండినా నిత్యోత్సవంబులు నెఱపినట్లు
పల దని కూయక పరు నీయనిచ్చినా వడివత్సరగ్రాస మిడినయట్లు
దారుణంబున నన్యధన మంటకుండినా సత్రంబులెచ్చోటఁ జల్పినట్లు
కావరంబునఁ బరసతిఁ గవయకున్న, సకలసౌఖ్యద సద్వృత్తి జరపినట్లు॥
ఖండము ల్గావించి గానుగఁ బట్టిన నించుతీ పిసుమంత డించనట్లు
కరపత్రమునఁ గోయ గట్టిరాళ్లనుదీయ శ్రీగంధవాసన చెడనియట్లు
శాణసంఘర్షణ సన్నంబులై రత్నవారంబు ఘనకాంతిఁ దేజినట్లు
పుటపాకతప్తమై పాలివోక పుత్తడి దాఁగంటఁ బడి వన్నె దాఁగనట్లు
నీచగతిఁజెంది దాత తా నిజగుణంబు, విడువఁడెన్నటఁ బ్రాణంబె విడుచుఁగాని॥

కాలరత్నముగాదె ఘనవసంతం బెన్న స్త్రీరత్న మరయంగ సీతగాదె
భాషామణియు గాదె భవ్యకవిత్వంబు మానరత్నముగాదె వారణాసి
విద్యకు రత్నంబు వినయసంపూర్తియు శౌర్యరత్నం బెన్న సవ్యసాచి
ధర్మరత్నంబగు దాతృత్వమహిమంబు రాజరత్నము గాదె రామమూర్తి
శక్తిరత్నంబు పార్వతి జగతియందు, దైవరత్నంబు నీవె కా తలంచిచూడ॥
బహుజనపోషకభాగ్యాఢ్యుఁడు ప్రభువగు నెద రాత్రిఁ భరియు లిలను తేదు
భూమి ఘనాతతి మోసిన యది సగ్గు మొగ్గి తుప్పలు తేవి మొల్చి చూడ
ఘనపర్వతం బెన్నఁ గనక గిరీంద్రంబె గండశైలము లెన్న గలవు ధాత్రి
మారుతం బెన్నఁగా మలయానిలంబె కా పుడిగాలి యేమి సొంపొసఁగఁ జేయు
దైవరాజన్న నీవె కా ధరను మిగుల, నన్ను చిల్లరదేవళ్లు నొంచలేవు, రామ॥
రాజరత్నంబగు రాముని నడవికిఁ బంపి కైకమ్మ యేభాగ్యమందె
సుగ్రీవురాజ్యంబు సుదతిని గొని లేచిపోవున్న వాలి యే భోగమందె
సాధ్విశిరోమణి జానకిఁ గొనిపోయి దశకంఠుఁ డేపాటి దశనుబొందె
జనకాజ్ఞఁ దల్లిని నరకునఁ జంపిన పరశురాముం డేమి పదవిఁ గాంచె
నిందమాత్రంబె వారికి నిలిచెఁ గాని, సౌఖ్యమందంగఁ జాలరే జగతియందు॥
సత్యహరిశ్చంద్రు సంకటపెట్టిన కౌశికుం డేపాటి ఘనతగాంచె
ధర్మరాజును ద్యూతధర్మంబుచే నోంచి రారాజ దేపాటిరాజ్యమేలె
మానిని ద్రౌపది మానభంగము చేసి దుశ్శాసనుం డేమి తోడవెట్టె
నలచక్రవర్తిని నలయిక పొందించి కలిపురుషుం డేమి కలిమి గాంచెఁ
బరమశాంతుని సారంగధరుని కాళ్లు, నఱకఁగాఁ జేసి చెలి యేమి కరము గాంచె॥
తాగడించెడువేళ దారుణంబుగ జూపు యాచకు లేతేర నధికరోష
మడిగిన మాఱొక్క సర్గంబు తే దను నెడపక పడియున్న చేచి తిట్టు
మఱిమఱి వేఁడిన మాంటు శేరుండును విసిగి వా లేగిర చేయు మొక్క
సుద్యోగదశచేత నూరూరి ప్రజలను గాసినొందఁగఁ జేసి ఘనధనంబు
గొంచుఁ దా మాఱు మిస్త్రి గోరసట్టి, లోభివర్ణింప నామదిలోన లేదు, రా॥
వైశ్వదేవము చేసి బైసిమాలిన [illegible] కేలు పట్టిన ధర్మలీల యగునె
నింటిలో నతిథికి నిష్టాన్నములు పెట్టఁ బెట్టియుండ్లఁ గన్నము శ్రేయఁ దగునె
ప్రొద్దుమాపుల దేవపూజలు సేయుచు బందిపోటులు వేయు భావ్యమగునె
నిత్యాగ్నిసంస్కారనిష్ఠయుండై ధాత్రి ననృతవాక్యంబుల నాడఁ దగునె
యొల్లుగా వించునరుఁ గాలుఁ డధికరోష, మునను దండించి నారకములను ద్రోయు॥

పదుగురు మెచ్చఁగాఁ బాడినయదె పాట యొరికి సాధ్యంబుగానిదె కోట
విబుధనివాసమై వెలసినయదె పేట యంబికేశు భజింపనదియె పూఁట
ఫలపుష్పదళగుచ్ఛ లలితమైనదె తోఁట యతిథిపూజ లొనర్చుటదియెమూట
ధీరజాల్ముల కుపకారమైనదె మాట యాదటనుమెచ్చినయదియె యాట
యనివచింతురు పూజ్యులహర్నిశంబు, తెలుఁగనేర్తురె మర్త్యులిహాపరములు
రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౮౦

పులిమీసములు పట్టి మలివేట్టఁగావచ్చుఁ గాయంబుపై వాస గల్గకున్నఁ
బాముపాతల దన్ని బాసిల్లఁగావచ్చుఁ దల దీము ననుభీతి దలఁపకున్న
భయదసింహాసటంబు పట్టి లాగఁగవచ్చుఁ బ్రాణహానికి భయపడకయున్న
గడుఁ బతివ్రతకరం బొడిసి పట్టఁగవచ్చుఁ గులహాని కాత్మలోఁ గొంకకున్న
నన్నిటికి రోయువాని కీసువని యుండుఁ, జేయరానట్టిపనియేది చెప్పవయ్య॥

గుడిమ్రింగువానికి గుడిలోనిలింగంబు పిండివడియముస్ల పేఁడంబు
కడుదివాణపువస్తు వడిమ్రింగువానికిఁ దవపిష్ట మ్రింగుట దారుణంబె
పరగణా మ్రింగెడు పాపాత్మునకు బొక్క పల్లెదోఁచఁగఁ గష్టపాటెచెపుము
బహుజనక్షేత్రము ల్పాడుచేసెడువాఁడు భటవృత్తి ముంచు టేపాటిదొడ్డ
సత్రముల రాల్పునేయు నపాత్రులకును, నెంతవిభవంబు గలిగిన నేమిఫలము॥

పదుగుర నొప్పించి పన్నులిచ్చుటకంటెఁ గష్టార్జితం బొక్క కాసుమేలు
ఘనవనంబులు గొట్టి కట్టుమేడలకంటె నింపైన యొకపంచటిల్లుమేలు
పాతకుండిచ్చెడు భక్ష్యాదికములకంటె సజ్జనాగ్రణి యిచ్చు జావమేలు
ద్రోవలుగొట్టి సత్రావళి యిడుకంటె న్యాయార్జితాన్నమెంతైనఁజాలుఁ
జపలుఁడైనకలయాత్రలుసల్పుకంటె, స్థిరతమీపూజ క్షణమైనఁ జేయమేలు॥

మనవిచేసిన పని మఱి యేమటంటివా సర్వజ్ఞతకు అట్టు జరగు నిపుడు
ధాతవ్రాసినవ్రాలు తప్పదటంటివా మునిసుతుఁ బ్రోచుట మొదలెసున్న
దుర్వారజననార్తిఁ ద్రోయలేనంటివా గరళంబుమ్రింగుట కల్లమాట
సకలలోకంబులు సమయింప సృజియింపఁ బెంపశక్తియుఁ గలప్రభులమతికి
నీకు ననుఁబ్రోవ భారంబెటిగనుతురగ, గానసన్నుద్ధరింపు సౌఖ్యముగ నిపుడు॥

కనకగిరీంద్రంబు కార్ముకంబైయుండఁ దలపుత్రపట్టుట తగునె నీకు
సామేనఁ బార్వతి చక్కనైయుండఁగా గయ్యాళిగంగ యేకారణంబు
రజతాద్రి నిలయమై రాజిల్లుచుండఁగా వల్లకాటికిఁ బోవు వాంఛ యేమి

బహువేదశాస్త్రము ల్పఠనచేయుటె కాని దైవరాట్టెవ్వఁ డని తలఁపలేఁడు
దానధర్మంబులు తగ నొనర్చుటె కాని సద్గుణంబులతోడఁ దొరసియుండు
డాంబికులువీరు తమగుణాడంబరములు, మెచ్చఁజెప్పుదు రుర్విపై మేరుధన్వ॥
సతిపతు లిద్దఱు సఖ్యంబు గావించి యెఱిఁగిరా గర్భం బదెప్పు డగునొ
నెలదప్ప గర్భంబు నిల్చె నందురు గాని యేపిల్లపుట్టునో యెఱుఁగ రెవరు
నైజజననంబని వర్ణించుటే కాని యెన్నఁడో ప్రసవంబు నెఱుఁగ రెవరు
శిశువు కాధారమా స్త్రీకుచంబులఁ బాల వేరీతిఁ బుట్టునో యెఱుఁగ రెవరు
ఏమి యెఱుఁగని తలిదండ్రు లేమి నన్ను, మాయగా నెంచ మిన్నిఁక మఱువరాదు॥
నీరిలోఁ బుట్టిన నీరిలోఁ బెరిఁగిన నీరు తామరలోన నిలువనట్లు
లాజ్యమొత్తయుఁ ద్రావ నావంతయైనను నాజిహ్వ నాలుక నంటనట్లు
పరఁగఁ గుమ్మరపుర్వు పంకంబులోఁ బక్కఁ బంకంబు పుర్వుపైఁ బాఱనట్లు
లద్దంబులోఁ జాయ లవి యెంత కన్పడ్డ నద్దంబు కాచాయ యంటనట్లు
విమలవిజ్ఞాని సంసారవిధమునుండి, రాజశేఖర విన్నను రాజయోగి, రామలిం॥
పిపిరికాయలో పుర్వు పిసికికాయలో చచ్చు నగ్నినాజ్యంబందె యగ్నియణఁగు
తేజస్తత్త్వజలంబు తేజంబు చల్లార్చు వారిసంభవవహ్ని వారి నడఁగు
భానుమయూఖము ల్భానునందే గ్రుంకు నిందునికళలన్ని యిందె సమయు
మూఢులు సంసారమోహవారిధిఁ బడి పారంబు ముట్టక భ్రష్టులైరి
జ్ఞానిహృత్పద్మకర్ణికాస్థానసంస్థ, తావకాకృతిఁ గని మోక్షధామునుండు॥
మూఁడాఱు వాకిళ్లు మూసి పైద్వారంబు తీసి తా దాఁటుచు దివ్యమైన
మూఁడుమూలలకొండ వేడుకతో నెక్కి మేడలో వెలిఁగెడు మేటిఁ జూచి
యక్షరంబులు నాల్గు నాఱునేకముచేసి యక్షయపదవిఁ దా నంది మిగుల
సాలోక్యసారూప్యసామీప్యసాయుజ్య ఘనచతుర్వర్గ సత్ఫలంబు లొదవి
సకలమేకంబుగాఁ జేసి స్వాంతమందుఁ, బరముఁ గను వాఁడె భువిలోనఁ బరమయోగి॥
ఈడపింగళనాడి యెగదీసి బిగఁబట్టి షట్కోశవైరుల సంహరించి
తనువుఁ బ్రాణంబును దత్త్వమందు లయించి తనువులోనున్నట్టిదైవ మెఱిఁగి
తనువుకోర్కు లడంచి తత్త్వశూన్యుండయ్యు బిందుద్వయంబున్న చంద మెఱిఁగి
శిరసులో మెలఁగెడు శీతాంశుఁ గనుఁగొని తత్కరామృతపానితనరిమిగుల
హృదయసంవాసు నిన్నని మోదముతోడఁ
బ్రణవసంధానుఁ డగువాఁడె పరమయోగి

